శ్రీరస్తు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.



# శ్రీరామస్తవరాజము.



ఇది,

పెస్టువార్డు అండు కంపెని వారిచే

అమెరికను డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణము.

శ్రీ రామస్తవ రాజము.

1937.

శ్రీరామాయనమః.

# శ్రీరామస్తవరాజము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీకల్యాణసదాశివేశ్వర కపర్దిబ్రహ్మవిష్ణుస్వరూ।
పాకారాకృతిమీరుపట్టి పరమాత్మైక్యానుసంధానుభో।
గాకారోన్నత యోగివర్య గురువాక్యావాప్తబోధోజ్వల।
శ్రీకాంతాప్రియుఁడైననిన్ను మదిలో సేవింతునశ్రాంతము౯॥

శా॥ శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా। కారుణ్యాభయదానహస్తవరదా కాకుత్స్థవంశోద్భవా। దారిద్ర్యాంధతమిస్రతాపహర జ్ఞాతత్వాబ్ధిచంద్రోదయా। రారా నామదిలో వసించి కృపతో రక్షింపరా ప్రేముక్కడి౯॥ ఉ॥ పెద్దల సేవఁజేసినను బెంపకుఁగాక వృథాభిమానులై। గద్దియ సద్దులం బగిలి కానక మూఢులు కొందఱుర్విలో। ప్రొద్దులు పుత్తురల్ల చెడిపోవక సామినిభక్తిఁ గొల్చిన౯। దద్దయుఁ మోక్షమబ్బఁగద దాశరథీ జనకాత్మజాధిపా॥ ఉ॥ కరములు మోడ్చి వాణిహరికిఁ గాళికి మ్రొక్కెదఁ గూర్మితోడుత౯। గురునకు వందనం బెపుడు గోరికఁ జేసెద కావ్యులన్నిరంతరముఁ దలంచెదన్ వలువదా వరసాక్షి నుతించెదన్ మది౯। సరసకవిత్వబోధలు వెసంగలిగించుటకున్మదంబున౯॥ గీ॥ మూఁడుమూర్తుల నుతిమిగ్గురిల్లాండ్రను। బ్రస్తుతింతుఁ బరమభాగవతుల। నుతుల చేసి పెక్కుగతుల వాల్మీకాది కవులఁ దలచి తెనుఁగు కవులఁ దలఁతు॥ వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబును బరమభాగవతకీర్తనంబును వాల్మీకాదిసత్కవిస్తోత్రంబునుం జేసి సర్వజనంబులకుం బ్రియంబు పల్కు మద్గురుండైన ధేనుకొండ తిమ్మయాచార్యుం బూజించి శ్రీరామస్తవరాజంబను మంత్రరాజంబుఁ దెనుఁగు సేయంబూని యేను బాల్యంబున సకల వేదాంతసిద్ధాంత సారసంగ్రహంబైన తత్త్వార్థంబుల తత్త్వచంద్రోదయంబను ద్విపదకావ్యంబు రచియించి యాతత్త్వచంద్రోదయంబునకు జానకీనాథు నాథుంగా నియోగించి సంతసిల్లితి నిప్పుడీమంత్రరాజంబైన శ్రీరామస్తవరాజంబను నీప్రబంధనాయక రత్నంబునకు సర్వలోకనాథుండైన శ్రీరుక్మిణీనాథు నాథుంగా నియోగించి సద్గురుధ్యానంబును బరబ్రహ్మరూపానుసంధానంబు జేసి కృతకృత్యుండనగు మద్వంశ

క్రమము బెట్టిదనిన॥ సీ॥ శ్రీకరంబైనట్టికృష్ణానదికి దక్షిణాదియాంధ్రరాజ్యం
బునందు। నొప్పైనకొప్పరావురు రాజధానికి భోజుండౌ ముమ్మడిరాజమంత్రి।
సుభగుండాపస్తంభసూత్రయజుర్వేది శాండిల్యగోత్రుండా చతురునకును। దన
యుండు పెద్దనాతనిసతిజువ్వాంబ వారికిగంగన్నవరసుతుండు। తానికిల్లాలు స
ర్వాంబవారలకును। సుసుతుండు కృష్ణయ్య ప్రభుండనంగగలిగిరిపుత్రుడు। పేర్మిందుర్భా
రివారాడబిడ్డయైన।రఘుపతమ్మను బెండ్లియై రమణమించె॥ క॥ ఏమనగువలుసరి
సాటిరెము। భూమిపతివ్రతలలోన బుధసభలందున్। వేమారుం గీర్తికెక్కిన।
యామిమ్మడిరాజకృష్ణయరఘుపతమ్మకున్॥ క॥ ఆమిథునమునకుసువ్వార।మే
ముదయించితిమిందుమేటగువాండన్। రాముని భక్తుండవల్లన నామాఖ్యా
తుండసజ్జనప్రియరతుండన్॥ క॥ గురుబోధామృతతుల్యుండ। గురుతరతత్త్వోప
దేశకోవిదగురుండన్। గురుసేవావ్రతచర్యుండ। గురుతరవేదాంతరంగ గురు
కవివరుండన్॥ క॥ కొలిచిన శ్రీరామచంద్రుని। దలచినదివరస్వరూపధ్యానము
సేయు।న్వలచినది ముక్తిలలనను। నిలిచినది పురాకృతంబు నిజమని తెలుపన్॥ క॥ ప
లికినది వేదతుల్యము।చిలకననదికృపారసంబు శ్రితజనులందున్।గులికినది యోగ
చర్యలు।నలికినయది యాయవిద్యయహితులు బెదరన్॥ శా॥ శ్రీశైలేశువరప్ర
సాదమున తత్సిద్ధాంతనామంబులన్। ఆసీతేశునివాక్యమా సభయము న్న
ధ్యాత్మతత్త్వంబును। ద్దేశంబొప్పంగ నారదుండు దయసందేహంబుల న్బాపు
చే। యీశాంభూగదసీవనేశజము యోగీశాబ్ధిచంద్రోదయా॥ అట్లుగావున॥

క॥ ఆరోగ్యభాగ్యములం గంగ। నారాయణునిం ప్రబంధనాయకముంగా।
శ్రీరామస్తవరాజము। ధారుణివెలయంగం జెప్పెదను స్ప్రీతిన్॥ వ॥ ఆదిసూత
ప్రణీతంబును వ్యాసధర్మజసంవాదంబును నారదప్రోక్తంబునగుటం జేసి యది
యు నొక యీశ్వరారాధన విశేషంబగుట సేంజేసెద॥

## షష్ఠ్యంతములు.

క॥ సర్వశరీరవిహారికి। సర్వాలంకారభోగ సౌభాగ్యునకున్। సర్వగు
ణాతీతునకును। నిర్వాణవిహారికి రుక్మిణీనాథునకున్॥ క॥ పరావర్జవికల్పిత।
దుర్జనసంసారదోష దూషితవాంఛా। నిర్జితయోగీంద్రవిపే। కార్జితవస్తు
వునకుంబరమానందునకున్॥ క॥ నిత్యనిరంజన నిరుపమ। సత్యాత్మా మోద వి
భవసామ్రాజ్యునకున్। అత్యంతభక్తహృదయ।ప్రత్యక్షునకును మహాసుభావా
త్మ్యునకున్॥ క॥ గోపాలవేషధారికి। గోపీజన పూర్వభాగ్య ఘోషాశ్రయు
నకున్। గోపస్త్రీవేష్టితునకు। గోపక్రీడావినోద గోపాలునకున్॥

క॥ శుక్తిరజతప్రపంచము। యుక్తిన్మిథ్యాభిమానమోహనపరుఁడౌ। భక్తపరాధీనుననఘు। భక్తునకుసు సర్వశక్తిమూర్తిన్మనసన్॥ క॥ ఓందుకళాతీతునకును। యిందుకళాధరనుతునకు పెంగ్రాఖ్యునకు। స్వాంధితసుత్రామునకును। యింకీవరనేత్రునకు మునీశ్వరపతికిన్॥ క॥ నీకుం బ్రబంధరత్నము। గానుక సేసితిని కారుణ్యమునన్। లోకంబులందు వెలసెడ। జేకొను సాకేతముపదన శ్రీకృష్ణహరీ॥ వ॥ నిత్యమంగళ పరంపరాభివృద్ధిగా నావిన్నపంబు సేయం బూనిన శ్రీరామస్తవరాజంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన నైమిశారణ్యవాసులైన శౌనకాదిమహామునీశ్వరు లొకానొకనాఁడు రేపకడ లేచి సంధ్యాద్యనుష్ఠానకృత్యంబులుదీర్చి సూతునిచేత సర్వపురాణేతిహాసంబులు వినుచు శ్రీరామస్తవరాజశ్రవణోత్సుకులై ॥ క॥ శ్రీరామస్తవరాజము। పారాయణమొనరఁ జేయుఁ బ్రతిదినము న్రశ్రీ। కారణగుణచేవాఁడే। నారాయణపదమునొందు నమ్మునిధాత్రిన్॥ క॥ శ్రీరామస్తవరాజకు। పారంభంబిట్టు శౌనకాదులు సూతుం। జేరి నుతించి మహాత్మా। తారకనామంబు మాకుదయసేయఁగదే॥ వ॥ అనిన నమ్మునులకు వ్యాసశిష్యుండగు సూతుండిట్లనియె॥

కథాప్రారంభము.

సీ॥ సర్వవేదార్థవిజ్ఞాన సత్యవతీసుతుండునౌ వ్యాసునిఁ బాండవాగ్రి। జుండు పూజలు సేసినుముఖుఁడౌ భగవంతుఁడవు మహాయోగీశుఁడవు శాస్త్ర। గురుఁడవు తత్త్వంబుఁ బరజనంబును ముక్తిసాధన ధ్యానంబు జాడ లెవ్వి। యెట్టి వియుక్తిగింపుడీరనరాజుతో వినుమహాభాగయేగనిన తెల్వి। యొద్దిపరమగుణాతీతమున్న నెద్ది। జ్యోతియమలంబు శివము దేశ్యాతిగాగ। బరమనిత్యంబు గై వల్యపదము శ్రోత। యిది యె శ్రీరామ యనుజపం బింతమహిమ॥ క॥ శ్రీరామజపోత్కర్షణ। తారకమను బ్రహ్మసంజ్ఞ దానిపఠించే। నాఁ కేదోషము నొందరు। యీరీతిని వేదవేత్త లెఱుఁగుదు రెఱుకన్॥ గీ॥ ప్రాజ్ఞులె వ్యాసు శ్రీరామరామరామ। యనుచు సతతంబుఁ బఠియింతు రట్టివారు। భుక్తిముక్తుల రెంటిని బొందువార। లిందులై సంశయింపగ నేలననఘ॥ మ॥ మహిమన్ని స్తవరాజమున్వలికె నాత్మజ్ఞాని యూ నారదుం। డు హరిధ్యానపురస్సరంబుగ నుట న్నైరూరనేఁజెప్పెదన్। బహుసంవత్సరముం దరిద్రహతమున్ బ్రహ్మైక్యసాధ్యంబునన్। సమాజంబావిచు మనుష్యదుఃఖమాల సంచారంబుల ర్వ్యాప్తుచున్॥ సీ॥ శ్రీరామకృష్ణాల సేవించి తద్ధ్యాన భావంబు లెఱిఁగింతు సావధాన। ముగ విను సాకేతనగరంబు లోపల రత్నమంటపమతిరమ్యముగను। దానిమధ్యంబున తలపోయ సురభూ

జనుగూర్మాలరత్నసింహాసనంబు। దన్మధ్యమున నష్టదళపద్మమునందును మాణిక్య
ములచే లసమానిదాని। నట్టి నడుమను రాముండున్నట్టు దలపు। కోటిసూర్యప్రకా
శమై యొప్పు మకుటముగల। సింద్రనీలసమప్రభలీను వాని। దండిగ నొడమీదగూర్చుం
డు దారవాని॥ సీ॥ అత్యంతకోమలంబైన యంగము గాని విమలవిశాలనేత్రముల
వాని। భానుకోటిప్రభాభాసితుండగువాని రంజిల్లు పీతాంబరంబు వాని। మా
ణిక్యకుండలమంజీరముల వాని గంకణకటిసూత్రగణన వాని। హారకిరీటకేయూ
రముల్గల వానిం గరము నొప్పు ద్విభుజముల్గలుగు వాని। చిన్నవానిని లేనవ్వులున్న వా
నిం। గదువు చెండాడి యోగశాస్త్రముల వాని। రాముండను పేరుగలిగిన రాచ
వాని నట్లుదలంపుము యోగీశుండైన వాడు॥ గీ॥ కిన్నరామరగంధర్వకింపురుషు
లు। నారదాగిమునీంద్రులు జేరికొలువ। భరతలక్ష్మణశత్రుఘ్న పరివృతుండు।
నామహాత్ముని సతతంబు నాత్మదలపు॥ గీ॥ వరవసిష్ఠ గాధేయాది పరమ ఋషులు।
జ్ఞానులైనట్టి సనకాదిమౌనివరులు। సేవసేయంగ రఘుకులశ్రేష్ఠుండైన। రామ
చంద్రునిం దలంపుము రాజవర్య॥ క॥ చక్కదనంబానందము। నిక్కువమై విల్లుబ
ట్టి నెరజాణతనంబు। పెక్కుపరంజ్యోతినిశుభ। పెక్కువనూగోన లేయునిట్టుల
దలపుమా॥ క॥ ఆనారదమునివర్యుండు। నానాలోకోపకార నటనల కొఱకై।
మానసమేపొంగగవిను। ధ్యానించెను రామచంద్రునద్భుతపరుండై॥ గీ॥ పర
ము నేకంబు నిత్యంబు నెఱుకసుఖము। నైనదెట్టిది యాలోకమందునట్టి। నిండిపం
డిన రూపంబు నేదలంతు। నను చుజింతింపుచుండె నావ్యాసమౌని॥ క॥ విజ్ఞాన
హేతుభూమిని। ప్రజ్ఞానుసవిమలనేత్రు భద్రచరిత్రున్। సుజ్ఞానదివ్యరూపుని। త
జ్ఞుని శ్రీరామచంద్రు దలంపుదునాత్మన్॥ క॥ కుఱుచగుటి లేనివానిని। చదువుల గు
నగుసల వానినసీసన్నయుడై। కదువల కొదవనివానిని। యొదలోగ నెరాచవాని
నేలినవానిన్॥ వ॥ అనుచుం జింతింపుచు వ్యాసుండు నారదవాక్యంబుగా నిట్ల
నియె॥ సీ॥ నారాయణుండు జగన్నాథుం గపీశ్వరరాజేంద్రు విశ్వేశు రామభద్రు।
జానకీవల్లభు సౌమిత్రి పూర్వజు శంకరు నాదిత్యు జామదగ్న్య। శాంతుని సత్య
సౌజన్యుని గురుమూర్తి గరుడవాహను విష్ణు గమలనాభు। దాపసకాముదు దశర
థవర పుత్రుం గారుణ్య నానందుంగాస లేయుం జిన్మయానందవిగ్రహు శ్రీశమూ
ర్తి। మత్స్యకూర్మవరాహాదిమత్స్యరూపు। వాసుదేవుని సవ్యయు వరదు హరి
ని నాత్మలోపలం జింతింతు ననుదినంబు॥ సీ॥ కన్నవాండా రారకనుగొన్నవాండ
రా చిన్నారి పొన్నారి చిట్టి రార। నాకూర్మిపట్టి రా నాకుమారక రార యన్నరా
రాముద్దు చిన్నరార। అయ్యరా రానల్లనయ్య రారా యిపుడు నాపుణ్యపరిపాక

నటనరార। నాచక్కనయ్యరానాతోడునీడరా యప్పచ్చికొండరామయ్యరా
ర।అప్పయిందులపత్తుసేయనుచుబిలుచు। తల్లికుల్లాసముగనల్లిబిల్లిగొనుచుఁ।
కాళ్లనందెలు ఘలుఘల్లుఘల్లుమనఁగ।మురుపుజూపెడుకౌసల్యముద్దుడలఁతుఁ॥
క॥తనపులనిన్నుఁగంటిని। యెడబాయగజాలరార యేమిటికొరకై। పొడకట్టి
వింతపడవని నొడివెనుఁగౌసల్యనోచునోముదలంతుఁ॥మ॥అనుచుఁ రాముని
జానకీసహితుఁగా నానందపట్టాభిషే। చనుఁగానిత్యునిఁగా మహామహునిఁ
గా సత్యవ్రతస్వాంతుగా। ఘనవేదాంతవివేకిఁగావిజయుఁగా గౌసల్యగారా
బుప। ట్టినిగాసౌమ్యకటాక్షవీక్షణునిగాడెందంబునన్నిల్పుచుఁ॥ గీ॥ భరతల
క్ష్మణశత్రుఘ్నపవనపుత్ర। భానుజవిభీషణాశ్రితభటులుగొలువ। సర్వయోగీం
ద్రపాదసంశ్రయుఁడనగుచు। జానకీయుక్తుడగురామచంద్రుదలచి॥ మఱియు
ను॥ సీ॥ అనిరుద్ధగతిఁగూర్చియనిరుద్ధమతిఁజేరియనిరుద్ధమార్గులైయలరువారు।
బిందుకళాంతనాదాంతకళాంత సంవిద్రూపమున విజ్ఞపీగువారు। నిర్బంధని
ర్బంధనిర్భిన్నభిన్నతత్వోపదేశికుజూపనోపువారు। నలఘువదస్ఫూర్తినలఘు
లఘుత్వులై యలరువారు।నుభయకన్యాసమేతులై యుండువారు।నవధిగలుగం
గలేకుండునవధివారు। గ్రాహ్యపట్టాభిరాములై రామునొలువ। వెలుఁగువెలు
గంగవెలుగులోవెలుగువారు॥ సీ॥ స్థానత్రయంబులసంగత్రయంబులబంధత్ర
యంబులబారదోల। జీవత్రయంబులచిత్త్రయంబులబింబత్రయంబులడిందు
పరచి।దైవత్రయంబులతాపత్రయంబులయీషణత్రయములదోషముడిపి।కర్మ
త్రయంబులకారణత్రయములవాసనాత్రయములవడినిద్రోచి। యుండుపరమా
త్మగనువారలుర్విలోన। బాహ్యసంసారమెల్లనుబయలుచేసి। ముక్తికాంతనుమది
లోనముద్దుగొనుదు।రనుచుశిష్యులబోధించినట్టివారు॥ క॥మాయయనుజోడు
దొడుగక।గాయంబనురథము నెక్కికర్మపువిటు। స్నేయఁగ నాశాబాణో। పా
యంబునఁజిత్తరాజుపడుమదిచేతఁ॥క॥హింసించెజీవరాసుల సంసారోత్తీర్ణశా
స్త్రసద్ధర్మగుడై। సంసారోహణుడైమీ। మాంసోత్తరకాండవశతమానవరా
జ॥వ॥అనుచుమనోవృత్తులఁదెలుపువారును, మోక్షంబుసద్గురుకటాక్షవీక్ష
ణాలేశంబునసులభంబగుగాని దుష్కరాభ్యాసయోగంబుల లేదనువారును,
మనోవృత్తివాయునిరోధంబైన యోగాభ్యాసబలంబు లేక జయించరాదను
వారును, జీవపరైక్యస్వభావంబునపవనసంకల్పంబు ప్రయాసంబుగానిల్పఁగా
నప్రయాసంబురోగాస్పదంబనువారును, రోగంబులకుందప్పిన వాయునిరోధ
యోగఫలంబధికాయుర్మహాత్వంబనువారును, యామాయామమహాత్వమహి

హంబులుసిద్ధక్రియామూలికామణిమంత్రతపస్సిద్ధులంగలదనువారును, శివాగ
మప్రోక్తంబైనమంత్రలయహఠరాజయోగంబులలో మంత్రరాజయోగంబుశి
వపంచాక్షరీయుక్తంబై కల్పితాకల్పితమాలికాజపంబునలయంబైనయజపా
మార్గంబునంబ్రవేశించి బంధత్రియరేచకపూరకకుంభకంబులం గుంభించి క
ర్మాష్టాంగహఠయోగప్రయాసంబున నష్టైశ్వర్యయుక్తుండగుచు నీశ్వరాను
గ్రహశక్తినిపాతసమయంబునసదాచార్యానుగ్రహంబున సాంఖ్యతారకంబుల
మీఱి కేవలకుంభకంబైనవిరాజయోగంబున జాగ్రత్స్వప్నసుషుప్తులనతిక్ర
మించినిష్ప్రపంచంబైనవెన్నెలబయలనుసరించి దుర్భరానందసముద్రంబున
మునింగి తెఱుపుమఱుపుతలంపు స్వరూపానుసంధానధ్యాన జపంబులులేక
యమనస్కంబైనతుర్యంబుననొకసెడకతాఁదానఁగనుఁజతుర్విధయోగరహ
స్యంబులందెలుపువారును, వేదాంతశాస్త్రంబులనిరామయనిరాభాసనిర్విక
ల్పనిష్ప్రపంచంబైనసనాతనబ్రహ్మదిదంశంబునరజ్జుశుక్తిస్థాణువులు లేనియహి
రజితచోరాద్యారోపణకల్పితోచిన మాయాప్రపంచంబు దబ్బరగుటంజేసి
సంవిన్మాత్రుండై జీవుండుతన్నుదాఁదెలిసినముక్తుండగు మాయానవిభ్రంబు
నతన్నెఱుంగమింజేసి బద్ధుండగునీబంధముక్తులు నాత్మకులేవు సంకల్పస్వభా
వంబనువారును, యాత్మసాక్షాత్కారపరుండైన కారణగురుండు శక్తినిపాత
సమయంబునదోఁచుననువారును, కర్మముక్తులు మహాసంకల్పభోగంబులఁగల
దనువారును, సద్భక్తినిఁగాని యీశ్వరానుగ్రహజ్ఞానంబులు లేవనువారును,
మఱియుదక్కినవారునుంబరివేష్టించికొలువ సింహాసనంబునసీతాసమేతుండై
యొప్పుశ్రీరామచంద్రుండదలంతునని మఱియునారదుండిట్లనియె॥ గీ॥ గోకులా
వాసుగోవిందుగోపినాథు। వేణునాదానుభవమునవెలయువాని। స్త్రీలతో
గూడిక్రీడలఁజెలగువాని। రామకృష్ణాఖ్యనామద్విబేమదలఁతు॥ క॥ చక్కనిబా
లుండనుచును। చెక్కిలిముద్దాడుస్త్రీల చేసన్నలచ। న్మక్కువలగిలిగింతలచే। జొ
క్కింపుచుగేలిసేయునుభగుదలంతుఁ॥ క॥ శుద్ధబుద్ధసిద్ధసూక్ష్మస్వరూపుని। సర్వ
ఘాతకర్తసర్వమయుని। సర్వకారణాత్మసత్యసంకల్పుని। ప్రణవవరునిరామ
భద్రుదలతు॥ గీ॥ రూపురేఖలేనిరొక్కమైయొక్కటై। వేళపాళలేకవెలుగుచు
న్న। రామచంద్రుఁబ్రకృతిరహితుమహాత్ముని। మదినిదినముసేనమస్కరింతు॥
గీ॥ చింతసోకబోకజేటుకుసారకనీక। లెక్కలేకయొకటితక్కగాక। కలిమిగాన
రాక తెలివియొవడిచీక। ఈననాకనేర్చువానిదలతు॥ గీ॥ అనుచునారదుఁడునాది
త్యవర్ణుగా। భానుబింబమధ్యవరునిఁగాను। సర్వసాక్షిగాను జానకీవల్లభు।

సన్నుతించిమదినిసంతసిల్లె॥ మ॥ అనునావ్యాసునితోడధర్మజుడుబోధానందమ
గ్నాత్ముఁడై। తనివోదింకమునీంద్రచంద్రపరమార్థజ్ఞానసంచారముల్। ఘనకర్మం
బుల్ త్రోవభక్తిగతిసాకల్యంబులౌనట్లుగా। వినిపింపుండనమానిపల్కె మనను
ద్విగ్నాకారనోరూఢగతి॥ సీ॥ భూనాథనీప్రశ్న పురుషార్థహేతువు లోకోపకా
రంబునౌగనంగ। పురుషార్థవిగతులై పోయిసంసారాబ్ధి వృద్ధియేపురుషార్థసిద్ధి
యనుచు। బెల్లామబిడ్డలుపెనిమిటియనుకొంచుకంటుకాపురమిదియంటదేల।
పోయియెన్నడు లేకనన్నింటికేకారికలగండ్లగున్నలై యిడుమపడుచు। నొక్క
నాడైననొకయింటియుబ్బలేక। పడుచు లేచుచునుండుటకెడము లేదు। యెప్పు
డైననుతమగతికొప్పరయ్య। యేమిచెప్పుదునీవెఱ్ఱికాముకులను॥ క॥ ఇటువంటి
మానసభ్రమ। నెటువలెగడువంగవచ్చునీశుడుసహాగా। మటుమాయనటనలఱ
చూ। చుటనిజపటాగాదెమఱియుజోద్యముగలదే॥ ఉ॥ నేనునునాదియానెఱుగ
నేననునోటిదినోటనుండఁగా। నేననహంకృతేయెఱుఁగ నైతికనిక్కుచునోటు
జెందుచు। న్నేననవెవ్వడోయగుచునేనునునేనునిజంబులై భ్రమ। జ్ఞానవశానకే
వుడగుసంస్కృతిబొందునరాధినాయకా॥ గీ॥ నేనుగలిగిననీవునుగానబడదు। నేను
నీవునుగలిగిననిగుడుజగము। నీవునేనునునొకటైనభావమెప్పుడు। గానబడునట్టికా
లంబుదీనికవధి॥ గీ॥ వీడువాడనినాత్మకెవ్వాడుగలడు। వాడువీడనమానసభావం
బు। వాడువీడునునొక్కటౌనాడజూడ। నెవ్వరెక్కడగానరెయెఱుకదక్క॥ గీ॥
దృష్టిగనుపట్టునవియెల్లదృశ్యమంద్రు। దృశ్యములగాల్పుతెలివితెలివియంద్రు।
తెలిప్రపంచంబునీవువిడిచిపెట్టి। నిర్వికల్పసమాధిలోనిగుడవయ్య॥ చ॥ చదివి
వెడిశాస్త్రవాసనలు సన్నుతిగోరెడిలోకవాసనల్। కదలుచుదీర్ఘయాత్రలను
కాలముపుచ్చెడిదేహవాసన। ల్మదమనివాసనాత్రయము మానినిజంబగుశుద్ధ
వాసనా। స్ఫుటగురుబోధలందుటలుపారముముట్టుటయెంచిచూడగన్॥ గీ॥ శా
స్త్రలోకదేహసామాన్యవాసన। త్రోవచూడముక్తిత్రోవగాదు। గాకమానె
నేసికర్మంబుపాలగు। నరవరేణ్యాకపరమర్మదేల॥ గీ॥ తనకుదానెకానితనకెద్ది
యును లేని। తలపుకలుగువాడుతత్త్వవేత్త। తగిలెనేనిపోదుతలపునదత్వంబు। త
గదుగురునిమీదితలపువీడ॥ గీ॥ తనువునీవుగావుతలపులునీవుగా। వింద్రియము
లుగావుయెఱుకగావు। తెలుపుమఱుపులేనితెలివియేనీవయా। చింతదీరిముక్తి
నాంతగూడు॥ గీ॥ నీవుగలుగుచోటనిబిడీకృతానంద। సంభ్రమంబుపరమసం
భ్రమంబు। నీవులేనిచోటునిబిడాంధకారాది। బంధకంబుకర్మబంధకంబు॥ క॥
లీలామానుషవిగ్రహ। నీలోనేనున్ననీవునీవేకనగా। నీలోనాశ్చర్యంబులు।

నీలోననెపుట్టుననగునిరై యుందుర॥ క॥ రావయ్యాధర్మతనయా। జీవుడనను
భ్రాంతివిడిచిచిత్తములోన। నిన్న నేసేవనికనుని। భావననీవౌట దెలియబడుసుమ
హాత్మా॥ క॥ జ్ఞానముసులభముకఠినము। లౌనీరెండుగనుత్రోవలవిధమెట్లనినన్।
తాననియెఱిగెడియెఱుకే। తాననిసులభంబునౌను తానకఠినమహా॥ గీ॥ సర్వక
ర్మపరతిగాకసంశయంబు। దీఱదామీదటనుగానిదివ్యమైన। సుఖముదోచ
దునాతోచుసుఖముదనకు। వేరుగాకుండ దెలిసినాధీరుడగును॥ గీ॥ అనఘబ్ర
హ్మాత్మవిజ్ఞానదృష్టాంతమెల్ల। దెలియజెప్పితినీవును దెలివినొంది సకలసామ్రా
జ్యసౌఖ్యముల్సమతనొందు। మొనకవంతునకెట్లున్న నేమికొదువ॥ గీ॥ వెలిప్ర
పంచంబుమిథ్యని తెలిసితన్ను। నెనగనేర్చినయోగీంద్రుడింటనున్న। యడవినుం
డినయారెంటినడకసమమె। కాకమఱియాత్మకీసటలాత్కారణంబె॥ క॥ ప్రారబ్ధ
మనుభవించక। తీరదుయాగామియంట దెప్పానువరుసన్। దీనమరిసంచితం
బులు। దీరును ననుగన్న వేళధీరాత్మునకున్॥ మఱియుగర్మంబెట్టిదనిన॥ సీ॥ క
ర్మముల్ చేసినకడ తేరగూడదు సేయకుండినగతుల్గాయకుండు। చేసినకర్మం
బుశివునకర్పింపుచు ఫలసంగరహితులై వరగవలయు। చేసియుకర్మంబుసేయ
కుండిన నేర్పుత్రిగుణభావంబని తెలియవలయు। కర్మంబులెవ్వనికైననిత్యనై మి
త్తికాచారనియమంబులంద్రుబుధులు। ఫలముల్దైన త్రిగుణస్వభావమునుచు।
నైనయధికారములకొద్దినాచరింప। వలయుగురువాక్యపద్ధతివరుసగాను। యా
త్మసాక్షాత్కరించు పర్యంతమధిప॥ గీ॥ సకలమాయాప్రపంచంబు సగుణమ
య్యె। సగుణనిర్గుణరూపంబుసాక్షియయ్యె। సాక్షిరూపంబు నిర్గుణరూపు
సచ్చిదానందమును రామచంద్రుడయ్యె॥ గీ॥ అట్టిరామచంద్రుననిశంబుకీర్తన।
ధ్యానములనునాత్మదలచితలచి। శాంతహృదయుడగుచుసత్సంగమునజేరి। భ
క్తిసేయునతడుభాగవతుడు॥ గీ॥ కర్మభక్తులచేతను గ్రమముతోడ। జిత్తవి
శ్రాంతినొందును శీఘ్రమందె। కావునను గర్మభక్తులు జీవునికిని। సేయవలసిన
కార్యంబుసిద్ధమయ్యె॥ సీ॥ తామ్రమృణ్మయశిలాదారురూపంబుల భావించు
బూజించునధముండు। పిన్నపెద్దలటంచు వేత్యొఱవరుసన సన్మానించువాండు
మధ్యముండు। తారతమ్యము లేక దైవమందఱియందునున్నవాడని చూచును
త్తముండు। నీయుత్తమశ్లోకుడీశ్వరుడగ్నిందుకన్న వానిసతంబు గాంచుచుండు న
ట్లుగావుననీతోచునఖిలజగము। నందునీశ్వరు నీశ్వరునందుజగము। వేఱు లేక
యుండుగొందువిధమునీవు। తెలిసికృతకృత్యుడవుగమ్ము నిరహృదయ॥ గీ॥
తామ్రమృద్దారుశిలలనువలపుతోన। యీశ్వరుండని పూజింపనేమిఫలము। తన

మదినయుండునీశుండుతన్ను దాను। దెలియ నేరనివానికి దెరువులవియ॥ సీ॥ ఆర్త
డై హరినామకీర్తన బెట్టుగా నోరార నెవ్వఁడు నొడువుచుండు। నత్యంతవాం
ఛతో నఖిలేశుచారిత్ర మింపార నెవ్వఁ డాలించుచుండు। సర్వసంగత్యాగసమ
తనిర్వైరుఁడై సంపూర్ణు నెవఁడు భోగించుచుండు। దేశికశ్రీపాదతీర్థప్రసాద
ముల్ స్వీకరించు నెవ్వఁడు చెలగుచుండు। వాఁడె ధన్యుండు మాన్యుండు వర్ణితుండు।
వాఁడె భక్తుండు ముక్తుండు వైభవుండు। వాని వెనువెంటనీశుఁడే వేళనైన। దోడు
నీడయైయుండు కరనాడునయ్య॥ శా॥ సత్సంగంబును నాత్మచింత గురువిశ్వాసంబు
వైరాగ్యము। న్వాత్సల్యంబును జిత్తశాంతియును సర్వభ్రాంతిశూన్యత్వము।
న్మాత్సర్యంబులు లేకయుండుటివి సన్మార్గంబులో యోగిక। త్యుత్సాహంబున
దన్నుఁ జెందిహృదయంబుప్పొంగఁగాఁ జొంద వా॥ వ॥ అనియనేకవిధంబుల గ
ర్మభక్తివైరాగ్యంబులకుఁ జిత్తవిశ్రాంతి కారణంబని జీవుని నిశ్చయంబును స్వ
రూపసందర్శనసుఖహేతుత్వంబును దెలుపంగలవాఁడననుచు మఱియు వా
సుండు ధర్మజునకిట్లనియె నానాదినిర్వికల్పుండై నయాత్ముని యందు మిథ్యారూ
పప్రపంచంబును గ్రోచిన తెఱంగెట్లనిన మాయాబ్రహ్మసాన్నిధ్యంబున శుద్ధస్ఫ
టికంబు మీఁద దాసానికుసుమంబు జేర్ప నదుముచ్ఛాయదోఁచినట్లు జీవుండుగనుప
ట్టు నాజీవుండు సుఖంబుననుండి విశ్వుండను పేరిట విషయంబుల ననుభవించు
జాగ్రత్వంబున దైజసనామధేయంబున స్వప్నంబునఁ గంఠప్రదేశంబున దక్షాగ్రి
ద్వ్యాసనాయుక్తుండై వక్త్రప్రదేశంబునం బ్రవేశించి సుషుప్త్యవస్థం జెందిప్రా
జ్ఞుండనంగ నహంకారంబనుతమంబునందు లీనంబై యుండేమియు నెఱుంగఁడు సం
విత్తుసాక్షిరూపంబున నుంచుటం జేసి తత్సాన్నిధ్యంబుననుండి వచ్చెంగావున నిం
దాక నేఁ ఖిన్నసేసితినోయని యూరకుండెడి విధంబు దెల్పుఁ దద్విధంబు చిత్తసహా
యంబునం దెల్పునా సంవిత్తుసాన్నిధ్యంబు లేకున్న నూరకుండుటను తెలివి లేకుం
డవలయు నాయహంకారంబెప్పుడు జాగ్రదభిముఖమగునప్పుడు సంవిత్తు సా
న్నిధ్యసహాయ తాత్పర్యంబున సుఖంబుననుంటినను నెఱుకి సంప్రాప్తంబగు నా
సుషుప్తినుండి తుర్యనామంబునందు రావస్థనొంది బ్రహ్మానందంబనుభవించుచు
నాభినుండి తుర్యాతీతంబున నతీతనామంబు ధరియించి మూలాధారంబున సర్వ
క్షణంబు పరమానంద సుఖస్వరూపంబుననుండి యథాప్రకారంబుగా తిరుగ
సతతం బీయవస్థాపంచకంబుల పంచదేహంబులు ధరియించి యీపంచకంబు
లంగూడునిది యోగి యెఱుంగు నితరులెఱుంగ రాజీవుండాత్మవాసనాసమయం
బున నవస్థాత్రయంబులం దాటి వాసనాత్రయంబులం ద్రోసి వాసనయుద్రోవ

నాత్మైక్యానుభవంబగుఁ దదాత్మానుభవసారంబునఁ బంచదేహావస్థాభిమా
నభంగంబై హృదయగ్రంథినాశంబున శుద్ధజ్ఞానంబున బ్రపంచంబు లేదనుట యు
పపన్నంబుగావున సుషుప్త్యవస్థయందుఁ జిత్తు సాక్షి యని చెప్పుట యుపచారం
బు శుద్ధసంవిత్తునందుఁ బ్రపంచభ్రాంతి రజ్జువందు సర్పభ్రాంతి తోఁచి పిదప లేని
తెఱంగున భ్రాంతి విడిన బ్రపంచంబు లేదై నందోఁచెనంటివేని ధవళశంఖంబు పీ
చిపచ్చనని భ్రమసిన నందు పచ్చన లేదు తియ్యని పాలకుఁ జేదన్న దోషభ్రాంతి
యేగాని తియ్యని పాలకుఁ జేదు లేదని నిశ్చయంబు సుజ్ఞానమార్గంబు నను
దున్నట్లుగా దెలియ జగద్భ్రాంతి శ్రీగురుకటాక్షంబునం దీఱు నీవును సద్గురుక
టాక్షంబున స్థానత్రయవ్యతీతంబైన తుర్యంబున బరమానందంబునం జెందు మా
సుఖంబు బుద్ధిచేత నెఱుంగంబడు బుద్ధికి దెలివి లేదన్న నా నిజంబు బుద్ధిజడంబుగా
వున బుద్ధిచేతఁ గనుట యుపపన్నంబుగాదైనను గన్ను లుండినంగాని సూర్యుని ద
ర్శింపఁగూడదు నేత్రోపాధిని సూర్యాంశంబైన నేత్రదృష్టి సూర్యునిఁ గన్నట్లు
సంవిత్తు బుద్ధ్యుపాధినింగను నంతఃకరణప్రతిఫలితంబైన చిత్తు బుద్ధ్యుపాధి నిత
న్నుఁ దాఁజూచు నగ్నియంశంబయిన దృక్కు తత్సహాయంబునఁ దన్నుఁ గన్నట్లు వృ
త్తిశూన్యంబైన బుద్ధ్యుపాధి నశంబునఁ దన్ను నాలోకించు చుద్విధంబైనట్లు సు
ఖంబునం జెందు నా బుద్ధిశక్తియగు చిత్తు వాసనాచతుష్టయమాలిన్యంబు లేకుం
డుటం జేసి బుద్ధ్యుపాధినిఁ దన్నుఁ దాఁజూచుక తన నంతఃకరణోపాధి యుపప
న్నంబగు నెండియు బుద్ధిశూన్యమసిన చో బోధలోఁగూడెంగావున శూన్యమనం
గాదైనను సుషుప్తియగు నా సుషుప్తియగుంగాక యంటివేని నా సుషుప్తి నిర్వా
సనమైయుండియు నందేమి యెఱుఁగక పిదప సజ్ఞానంబునొందెడుగావున సుషుప్తి
గాని దేబోధలోఁ గూడినఁ దుర్యమాబోధ లేకున్న నజ్ఞానంబగును విషయాహం
కారమాలిన్యవృత్తిశూన్యతయు బుద్ధిశూన్యత యా బుద్ధిశక్తియైన చిత్తు సంవి
త్తునం జూచుచు సుఖస్వరూపుండగుట బ్రహ్మానందంబునం జొక్కుచు నా బా
హ్యంబు మఱచునప్పుడు జ్ఞప్తిమాత్రుండై బుద్ధిచేఁగాని తెలియరానివాఁడై
యుండు నా సమాధిసమయంబున మనోలయ చిత్ప్రకాశంబైన నెఱుకదక్క తక్క
న ప్రపంచంబు లేకుండు నా సమాధ్యంతరంబు నలయంబైన మనస్సున బాహ్యబహి
ర్వ్యాపారంబు గలుగు నట్లనిన రథంబున దురంగంబులం బూన్చి యభ్యాసమా
ర్గంబున నడిపించుచు మధ్యే రథికుండూరకుండ యశ్వాక్రమంబుగా నడుచునట్లు బు
ద్ధివృత్తిశూన్యంబైన ప్రారబ్ధనాశపర్యంతంబును గళేబరంబు సుఖదుఃఖంబు
లం జెందినట్లుండిను నాత్మాలోకనపరుండైన నాడితర ప్రపంచంబుగని యున్నఁ గనని

వాఁడై యుండునని మఱియు మహేంద్రుం డిట్లనియె ॥ సీ॥ బ్రహ్మంబు నేననిపలు
మాఱుననవచ్చు బ్రహ్మబోధ మెఱుంగు భావమరుదు। వేదాంతశాస్త్రముల్ విభ
జింపగావచ్చు నాత్మార్థముల దెల్పుటదియునరుదు। స్వాంగంబులను వేసి సన్యాసిన
నవచ్చు శూన్యమార్గంబులో జూచుటరుదు । అవిబంధమోక్షంబు లనిచెప్పగా
వచ్చు దానుగానిలకడ దనరుటరుదు। తనువునర్థంబు గురునివియనగవచ్చు। దారి
మొనసిన లోభంబు దీఱుటరుదు। మనసు సామర్థ్యమెఱిగెడి మర్మమరుదు। అం
తతానయ్యె గాకుంచుటదియునరుదు॥ గీ॥ శుష్కవేదాంతసిద్ధాంత మాటిపరు
లు। ఆత్మ నెఱుగక యర్థముల్ వ్యర్థముగను । జెప్పుచుందురు లోకుల జెరుచుకొ
ఱకు। నిజము నిష్ఠూరమైకల్ల నిజములాయె॥ మ॥ అరయన్ బ్రీతిపరాశరాత్మజు
డు బ్రహ్మానందవర్షంబుగా। గురియించె న్నిబిడీకృతామృతలసత్ శ్లోకాలాపాలో
ల్లాసియై। గురుకారుణ్యమహాప్రభావమున గోర్కుల్ దీర్చియుంగోరబ్ర । హ్మరు
షీంద్రుండఖలరాజుతోననియె వాఙ్మాధుర్యచాతుర్యుడై॥

మ॥ మనుజేంద్రాగ్రణి యల్లనారదుడు రామస్వామినింగూర్చిచాలన
మస్కారముతోప్పజేయుచు నుతుల్గావించె దత్స్వరూ। పునిదేజోమయ సూ
ర్యమండలగతున్ బూర్ణాత్మునాదిత్యవ । ర్ణునిలోకేశుబురాతను న్మలినహీ
నున్బుద్ధినూహించుచున్॥ గీ॥ రఘుకులాధీశు లోకాభిరాము విష్ణు। సజనపార
చిదానందు హరిముకుందు। బరమపరుడౌచు నేకమైపరగువాని । సంవిదాత్ముని
శ్రీరామచంద్రుఁదలతు॥ గీ॥ మునులకెల్లజాలధనమైనవానిని। బాపములను జె
ఱుచుపరమపరుని। నన్నితానెయగుచునన్నింటికధికమా। వానిదలచి మ్రొక్క
వాడననుచు॥ గీ॥ పారెనారదుండు సంభ్రమముల్గడుచుచు । మఱియుమఱియు
రామమహిమదలచె। మమతగలుగవారిమర్యాదగాబోలు। మఱిగితిరిగియా
డుమాటలాడు॥ మ॥ హరిరుద్రాదిసురుల్ నవగ్రహముల ష్టాంగాదియోగవ్రతుల్।
ధరవర్ణాశ్రమయజ్ఞదానజప సంధ్యావందనాదిక్రియా । చరణుల్ సప్తసముద్ర
ము ల్త్రివిధదీక్షా బ్రహ్మవిద్యాధురం । ధరులన్ వేదపురాణశాస్త్రములు సీతా
రామునీవేకదా॥ గీ॥ అనుచు నిట్లు సూక్ష్మనఖిలాంతరాత్ముని। శాంతునీరజాక్షు
సత్యధనుని। బ్రహ్మమూర్తియైన రామచంద్రస్వామి। సన్నుతించుచున్న సమ
యమునను॥ సీ॥ శ్రీరాముడప్పుడు నారదుముందర నిలిచి మహేంద్ర నే నీవు సేయు।
సన్నుతుల్ మెచ్చి ప్రసన్నుండనైతి నిష్టార్థము ల్వేడుము తనరననిన । నారదుండి
ట్లనె నానుతికిష్టంబు నీమూర్తిగన్న దేనేడు నేను। ధరగృతార్థుడబుణ్యాధన్యుండ
ఘనుడనాజన్మమిప్పుడు చాలసఫలమయ్యె। దపమిదే ఫలించెను దపములెల్ల।నన

ఘమిా పాదదర్శనమబ్బినపుడె। నిర్మలంబాయెనదైవతనిజము నేడు। స్వచ్ఛమైనట్టినీనామజపముచేత॥ శా॥ ఈరీతిఁ గొనియాడు నారదుని దావీక్షించి సత్ప్రేమనిం। క। నావోయివరంబు వేడుమను నాకాకుత్స్థుఁ తో మౌనిన౯। జేకేడి మ్మునికోరనిచ్చెవయ॥ శ్లో॥ శ్రీరామచంద్రుండయో। ధ్యారాజ్యంబునజానకీసహితుడై ధర్మంబు పాలించుచుఁ౯॥ సీ॥ ఇదిరాఘవస్తవంబిదియుత్తమోత్తమంబిది సర్వసౌభాగ్యమిదియుముక్తి। ఇదినారదప్రోక్తమిది వేదసారంబు నిదిరహస్యశ్రేష్ఠమిది శుభంబు। నిదితపస్సారంబునిది పుణ్యపాకంబు నిది త్రికాలంబునజదువువారు। పుత్రమిత్రకళత్రపౌత్రాభివృద్ధియునిత్యకల్యాణంబుపచ్చతోర। ణములుపాడియుబంట సంభ్రమములింట। గలిగియుందురు సంపూర్ణ కాములగుచు। బుద్ధివాక్కాయకర్మములపూర్వకర్మ। మైనసంతదుపకరియించునట్టివారి॥ క॥ గీతానామసహస్రము। సీతారామస్తవంబు శ్రీగుణకరము। స్ప్రీతిబఠించును నెవ్వం। డాతని నారాయణసముడంద్రు మహాత్ముల్॥ వ॥ అనియిట్లు వ్యాసుండు ధర్మజునకెఱింగించెనని వినిసంతుష్టాంతరంగులై శౌనకాదిమునులటమిాది వృత్తాంతం బేమి చెప్పె నెఱుంగింపుడనిన॥ క॥ వేదాంతతత్త్వసన్ఛంద। వాదాస్పదధర్మచరిత వసుదేవసుతా। వైదర్భీసత్యాత్మా। మోదక్రీడావినోద మురళీనాథా॥

మాలినీ॥ సముఖఘనవిలాసీ సుప్రసన్నాత్మవాసీ।
ఛ్రిమతిమిరదినేశా భక్తలోకప్రకాశా।
అమితగుణచరిత్రా యార్యసుస్తోత్రపాత్రా।
విమలప్రణవసీమా వృష్ణివంశాబ్ధిసోమా॥

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వరప్రసాదలబ్ధ కవితావిలాస శాండిల్యగోత్ర పవిత్ర కృష్ణయామాత్యపుత్ర వినుతగుణధైర్య మల్లనార్య ప్రణీతంబైన శ్రీరామస్తవరాజంబను మహాప్రబంధంబునందు హరిధ్యాన పురస్సరంబైన శ్రీరామకృష్ణస్తోత్రంబును, ధర్మజుండు సుజ్ఞానభక్తి కొఱకు ప్రశ్నించేసిన వ్యాసభట్టారకుండు సవిస్తరంబుగా తత్త్వార్థంబులం దెల్పుట యున్నది ప్రథమాశ్వాసము.



శ్రీరామాయనమః.

# శ్రీ రామ స్తవ రాజము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీమద్ద్వైపభవకారణ।
ధీమన్నుతదేవదేవ దివ్యమునీంద్ర।
క్షేమంకర వేదార్థ।
ప్రేమాస్పదజనవిహారి శ్రీకృష్ణహరీ॥

వ॥ దేవా! సూతుండు శౌనకాదిమహామునీంద్రులకిట్లనియె నట్లు శ్రీకృష్ణ ద్వైపాయనుండు కౌంతేయాగ్రజుంగనుంగొని సర్వప్రపంచంబు మనోవి కారంబుగావున మనస్త్యాగంబు సేయవలయు దన్మనస్త్యాగంబునకు గురుసేవ కారణంబనియిట్లనియె॥ గీ॥ తల్లితండ్రి లేనితనయునిపోలికె। సతికిబతియు లేని చందమునను। గురువు లేనివిద్యగూడ నెందులకైన। నజునికైన నిజమునరసి చూడ॥ గీ॥ తల్లిదండ్రిగలరుతగజన్మజన్మాన। నరయబంధుమిత్రులట్లకలరు। తన్ను దెల్పుగురుడుతగదొరకడుభువి। దొరుకుజెల్లముక్తి దొరుకుటధిప॥ గీ॥ తల్లిదండ్రిఋణముదైవర్షిఋణమును। దన్ను నెరుగదిరుతత్వమందు। బరమగురుని సేవపాటింపకుండెనా। ఋణముదీరదండ్రుగూఢిమునులు॥ గీ॥ సూచక నిషిద్ధ బోధక నాచకులను। గడగి కామ్యకర్మసమయకారుణులును। ననగనెనమండ్రు దేశికులందులోన। సద్గురుండగుకారణాచార్యవరుడు॥ గీ॥ అట్టికారణగురుడారయ దైనవాడు। రామభగవాను లేకానిసీమలోన। నితరజనులుతమ్మెరుగంగనెంతవారు। నరుడుగురుడనిపల్కుట న్యాయమధిప॥ సీ॥ సద్గురుధ్యానాత్మసంపన్నుడగువానినరకాలి బ్రాతయెవ్వనికిలేదు। సతతంబుకారణాచార్యు జేరినవాని కానగోరబోలనెవ్వనికిగాదు। శ్రీగురుశుశ్రూష సేయనేర్చినవానిచరణరేణువు సమంబౌవరుగారు। దేశికప్రీతిగాదిరుగనేర్చినవాని సరసమాత్రాంశమెవ్వారునుగారు। దానమానచాంద్రాయణధ్యానవిహిత। మంత్రతంత్రాధ్యయనజపమర్మకర్మ। తీర్థయాత్రాదికస్నాన దివ్యధర్మ। కైననాచార్యుజేరినవానిసమమె॥ క॥ గురుశుశ్రూషలు సేయుని। నరకడుసంసారమునెడినట్టిటముణెం। గిరు

ణస్థపుబొందై యిహ। పరములు లేకుండు నెందుబశుకర్మందై॥ క॥ గురుబోధ
నెఱిగినట్లా। పరిపరివిధమైన శాస్త్రపారవ్యసనం। బెఱిగించు నె పురుషార్థము।
పరిపక్వముగానివారిభ్రాంతులుగాగ॥ క॥ పరసత్తములను కారణ। గురుచే
తను దానఁ దెలియగూడినయట్లా। నరక ప్రసిద్ధ వాసన। శిర వౌ పారవ్యసనము లెరు
కను నగునే॥ వ॥ అనిన వ్యాసభట్టారకు నకు ధర్మజుం డిట్లనియె॥ క॥ ఆయ్యా గురు
వుల చరితం। బెయ్యది నేతీరువార లెవ్వరు చెప్పుమా। సయ్యోపాతర తెలయదు।
అయ్యాశ్రమధర్మమెట్లులాచారంబుల్॥ క॥ కారణగురుమహిమంబులు। వారికి
శుశ్రూష సేయువర్తనలన్నిగ। దేరుగడ సేయవయ్యా। సూరిజన స్తుత్యచరితసు
స్థిరభరితా॥ సీ॥ అదిగాక బహువిధంబైన సంసారము ల్వారలనడవల్లు పౌరుష
ములు। మాయాశరీర మర్మంబులు పురుషుం డురమణులవీడు విరక్తి త్రోవ। మో
క్షాధికారము ముక్షుండు కారణాచార్యు జేరెడు జాడ సాంగముగను। దెలుపు
ముమఱియేమి తెలుపంగవలయునో నన్నియు నెఱిగింపు డనుస్స్రపాలు। తోడ
వ్యాసుండు సెప్పంగ దొడగు నిట్లు। రాజయోగంబు తెల్పు కారణగురుండు। వాని
మహిమలు సంసారవర్తనములు। ముందుగా దెల్పు మంతకు మున్నె తెలియు॥
క॥ మాయాసంసారంబులు। రోయక గురుమహిమ దెలియ దోషులు గలవా। కా
యమనిత్యంబని గురు। రాయని చేబడక తమకు బ్రతుకులు గలవే॥

## జీవవిచారఘట్టము.

సీ॥ జీవునిసంసారచిన్నెలామూలాగ్రముగ జెప్పెద నువిను మొదల మొదల।
స్వప్రకాశమునను చనున హంకారమా వరణవిక్షేపమై స్వస్వరూపు। మఱపిం
చుపురుషుని భ్రమగ ఱపించినందుచే నెద్దియు నెరుక లేక। వెనుకముం దెరుగక
వెఱ్ఱిపట్టినవానివిధమున నాసచే వెతలబడుచు। వెఱలుపోసుకొంచు గొదవని మో
హాతి। శయము చేత వట్టి జాలిగోడు। గుడుచుచుండుగాక ఝడిసియింతట నైన।
తోడుసుమాలిపోడు దుఃఖి జీవి॥ క॥ ఆవరణమనగ మఱుపే। కావున దాసన్నద
న్నుగానక యుండ। నన్నవిధమున దానసతా। నైవేఱే భ్రాంతి పెట్టు నాత్మనివ
త్సా॥ క॥ విక్షేపశక్తియనగా। మోక్షవ్యతిరిక్తమైన మోహవికారా। ల్లక్షలప
ర్యంతంబుల। రక్షణమునదోచు గాపురంబులకిరవై॥ అదియునుంగాక॥ క॥ జీ
వుండిట్లుతనున్ శ్రీయ। భావనచే గలిగెవాని ప్రకృతుల్వినుమా। కైవల్యంబును దబ్బ
ర। గా వేరొక కల్పితుండు గలిగె నృపాలా॥ క॥ అనవినిరాశేంద్రుండును। సనఘ
నిరాకారమును సాకారంబే। యనుచును గలిగెను జీవుడు। తను వులు మూడిట్లు
దాల్చె త్రివిధ మెల్లన్॥ గీ॥ తెలియ జెప్పుమన్న దేశాధిపతి తోడ। మునికులాధిపం

ద్రుడనియెనిట్లు। రాజవర్య వినుము బ్రహ్మస్వరూపంబు। మొదలుగాను బోధప
దిలపరతు॥ అనియెట్లంచేని॥ సీ॥ అమలమై స్వచ్ఛమై యాద్యంతశూన్యమై శభ్రి
మై ఘనసంవిదభ్రమగుచు। నిత్యమై సత్యమై నిర్మలాకారమై యఖండమై యానంద
కందమగుచు। పూర్ణమై దివ్యమై బోధస్వరూపమై బుద్ధంబునై స్వతస్సిద్ధమగుచు।
నమితమై నిర్ద్వైద్యమై నిరంజనమై పరంజ్యోతియై మహారణ్యమగుచు। నద్వయబ్ర
హ్మచైతన్యమై వెలుంగు। నట్టిబైటను నేమిగన్పట్టుకొట్టు। లై నయిబ్బంది తెల్వి
కై లేనిదే కలిగెననవల సర్వజ్ఞసర్వగతినిననఘ॥ క॥ లేకేగలినపురుషుడ। యాకల్పి
తుడసగ యాతడాదబ్బరనా। లోకించితానుహత్తు। త్వాకారంబై నయీశుడ
య్యెంగినన॥ క॥ అయ్యాయుత్తమమధ్యమ। నియోహంబ నెడినహామునిగుడె
న్విసుమా। వెయ్యేలికని యోహం। బైయిప్పడిభాతికాఖ్యహంకృతివలనన్॥
గీ॥ ఆదిశక్తియుక్తుడై తమోగుణియునై। జ్ఞానవికృతితోడగానబడుచు। కడ
తోడవిశ్వకారణదేహుడై యాధికల్పితుండు రుద్రుడయ్యె॥ క॥ ఖ్యాతిగభూతో
త్పత్తికి। యాతడయాత్మస్వరూపుడై భూతాత్మా। యాతనిచూపే కాలం। బే
తరినిండినను కల్మనెరుగుము బయలా॥ గీ॥ గగనవిస్తీర్ణమై గాలిగాలిచుట్టి। పట్టి
మథియింపగానగ్ని పుట్టెదీని। యురముజలమంద్రు వేత్తలు యొప్పతోడ। నట్టినీ
రంబు బలుపయా యవనిననఘా॥ క॥ ఈరీతి పంచభూతములారయ కల్పింపబడి
యొననికలయుంబి। బారూఢంబిదివ్యష్టిశరీరంబనిపించుకొనును పృథ్వీనాథా॥

## పంచీకరణ లక్షణము.

వ॥ విను మా పంచవింశతితత్త్వనిర్ణయం బెట్లన్న నీపంచభూతంబుల నొక్కొక్కటి రెండేసిగా విభాగించి యందులో నొక్కొక్క నిజాంశంబులుంచి తక్కిననొరండొంటి నాలుగేసిగా భావించి పంచికలయుంబంచీకృతంబయ్యె తద్విధం బెట్లన్న ఆకాశార్థభాగంబు జ్ఞాతృత్వమయ్యె తక్కిననాల్గును వాయ్వగ్నిజలభూములగూడి మనోబుద్ధిచిత్తాహంకారంబులయ్యె పవనార్థభాగంబు వ్యానమయ్యె తక్కిననాల్గును పృథ్వ్యప్తేజోనభంబులంగూడి ప్రాణాపానోదానసమానంబులయ్యె హుతాశనార్థభాగంబు చక్షువయ్యె తక్కిన నాల్గును భూనీరమారుతవ్యోమంబులంగూడి ఘ్రాణజిహ్వాత్వక్ఛ్రోత్రంబులయ్యె కీలాలార్థభాగంబు రసంబయ్యె తక్కిననాల్గును ధాత్రీకృపీటప్రభంజనశూన్యమార్గంబులంగూడి గంధస్పర్శశబ్దంబులయ్యె క్ష్మాతత్వార్థభాగంబు పాయువయ్యె తక్కిననాల్గును వారిధనంజయసమీరాంతరిక్షంబులంగూడి గుహ్యపాణిపాదవాక్కులయ్యె యిట్లు పంచవింశతితత్వాత్మకంబైన స్థూలదేహం బింక

కర్మజ్ఞానేంద్రియదశకంబును పంచప్రాణమనోబుద్ధులంగూడి సూక్ష్మాంగంబ నులింగశరీరంబయ్యెనీ రెంటికి కారణంబగుటనవిద్యాకారణాంగంబయ్యెనీ దేహత్రయంబులంగూడిజీవుండుజాగ్రత్స్వప్నసుషుప్తులనునవస్థాత్రయంబులంబడి పొరలుచు మాంసనిర్మితంబైన యీస్థూలకాయంబునం దహంకారమమకారంబు సేయుచు దేహాత్మాభావంబుల తన్నుదానెరుగక కర్మంబులు చేసి స్వర్గనరకంబులంబొందుచు క్షీణభోగంబుల సర్వజంతుయోనిద్వారంబులం బుట్టుచుంజచ్చుచు నెడలేనిదుఃఖంబులంబొందుచుండుగాని సర్వభోగవిరక్తుండై శాంతహృదయుండగుచు యీశ్వరోపాసనావిశేషంబుల చిత్తంబు గల్వనేరదదెట్లన్న వినుము॥ గీ॥ చీము నెత్తుర్ల చేతను చితుకుచుండు। మూత్రమల సంయుతంబై పురుగులతోలు। కండలెమ్ములు ప్రేవులు నిండియుండు। యిట్టి దేహంబులందవస్థేమి చెప్పుము॥ సీ॥ బయిసిహీనముదుఃఖబహుళమాకారంబు ముంగిలిమంగలభంగభూమి। తేరనవ్వులపోతు దేహస్వరూపంబు రోగాలపుట్టయిరోతకొంప। భయముల పుట్టిల్లు పాతకంబులబొంది యముబారిగొత్తయీయలతియొడలు। మలమూత్రరక్తదుర్మాంసమీ చెడుడొక్క కసుమాలిబాములీకష్టతనువు। తోకపురుగులగుంటయీతోలుతిత్తి। యినుముపాటులకొడిగట్టుయీశరీర। మందలాకాంక్ష సౌఖ్యములందుగోరి। కోరిశుద్ధపశుప్రాయులై జనులు॥ సీ॥ గుణములులోభములు కొమ్ములుగరిశెలు యీశలుతలతోకయవధినోరు। సకలావయవములు సంగత్రయంబులు గులగోత్రసంగార్థములుపాలంబు। నుందుసంసృతిదొడ్డమమతకర్మముగాడి పంచేంద్రియంబులుబల్మివలువు। పూరియావిషయముల్ క్రూరముల్ మేతలు ప్రేమాతిశయములు పెత్తతొట్టి। ఋణముసుఖదుఃఖము బాధలు రోతకుడితి। కాపురముచెడు మోహంబెకల్లతెల్వి। బ్రహ్మమందునదోచిన భ్రాంతిగొల్ల। మనుజులను పశువులకిట్లు ననఘచరిత॥ క॥ ఈరీతి పశుప్రాయులు। నైరోషద్వేషులై దురాచారులునై। వారును వీరును మీమా। వారని స్త్రీవాంఛదగిలి వశులైరి నృపా॥ క॥ ఆలుంబిడ్డల కొరకై। జాలింబడిధనముగూర్చి చచ్చినదనకా। వేలాకోలముమెందును। స్త్రీలోలుండైనవాడు చెడిపోవాడై ॥గీ॥ కాంతదగిలినవారికి గలదె సుఖము। వారిపోషించుటకు చాలవనరివనరి। తిరిగి తెచ్చినయవిదాము దిన్న వెనక। మొంగిలైనను భక్షించుటిట్లుగాగ॥ సీ॥ బహువిధరోగంబు భార్యానుభోగంబు సిగ్గుల చేటు నీ స్త్రీలకూట। మత్యంత పాతకంబంగనాసంగమం బిహపరదూరంబులింతిపొందు। దుఃఖస్వరూపంబు తోయజేక్షణపొందు లుద్బంధమరణంబులువిదచెలిమి। అతిఘోరనర

కంబునతులలో లత్వంబుతలయెత్తరాములుచెలులగోష్ఠి। గాపురించెడిసంసార కష్టపాటు। రోతకూటిబ్రతుకరణ్యరోదనంబు। లేమిజెప్పుదు లేహ్యామంచెత్తిగి దీని। సన్యసించినవాఁడెబో జాలుడధిపా॥ సీ॥ యిల్లువాకిలిరోసి యిల్లాలినెడబాసిచుట్టపక్కములనుసారిదిరోసి। వన్నెవాసులువీడివాంఛలుగోరాడి సొమ్ములుదిగనాడిజోలివీడి। యాడికసోకోర్చియవమానములునోర్చినడవడిపోకార్చితోడుసుదీర్చి। కర్తృత్వములుమీరికర్మములొకతేరిభావంబులనవీరిభ్రమలగేరి। నితరసంగంబులెల్లనునేహ్యాకుడిచి। యతిమహేశ్వరుఁడై యింటియాశవిడిచి। తిరిగిచూడక దాబయల్దేరినడచి పరమగురుజేరజన్మసాఫల్యమనఘ॥ సీ॥ సంగవిరక్తుండుశృంగారయుక్తుండు సంగవిరక్తుండుసర్వజ్ఞుఁ। సంగవిరక్తుండుబంగారుబిడ్డడు సంగవిరక్తుండుసర్వసముడు। సంగవిరక్తుండు సంతతానందుండు సంగవిరక్తుండుసంభ్రముండు। సంగవిరక్తుండుసంపూర్ణకాముడు సంగవిరక్తుండుసన్నుతుండు। సంగవిరతుండు చిత్తరశాంతిపరుడు। సంగవిరతుండు దేవతాసముడుఘనుడు। సంగవిరతునిసరిసాటిఁగతిగలరె। సంగవిరతుండు పూజ్యుండుసభలలోన॥ ఉ॥ ఈవరగర్వముంవిడచి యీశ్వరునందుఃబ్రీతిఘట్టిగా। భావననిల్పియాడుచును బాడుచు శ్రీహరినామకీర్తనల్ లావుగజేయుచున్నజనులంగనునెవ్వడుజేరువానిడే। జీవనముక్తివేకమును సిద్ధముపాండవవంశపావనా॥ గీ॥ పాండవోత్తమువినుపరబ్రహ్మమైన। రామకృష్ణులనామకీర్తనల మహిమ। లేమిజెప్పుదు ధాత్రిలోనెవ్వరైన। వాంఛనొకమారుబల్కఁ పావనులజేయు॥

## నామకీర్తనవిచారఘట్టము.

గీ॥ నామకీర్తనసరిసాటి భూమిఁగలదె। తెలియనేరనిమూర్ఖులు తీర్థయాత్ర। లంచుదేవతాసేవ లస్లించుచుండ। బట్టకతిరుగ్రిహాచార బాధగాక॥ క॥ జారుండైననువృద్ధా। చారుండైననుగృహస్థసంచారుడై। శ్రీరామాయని యొకపరి। నోరాడినజాలువానినూరేడులకున్॥ సీ॥ తెల్లవారకతొల్లిచల్లనీటిలోవాయుకొనొడలెల్లవణకువారు। నీరుకావులుగట్టినిల్లుదర్భలచేత సవ్యాపసవ్యములెంచువారు। బిగుసుకముక్కులుబిగియించిగొణుగుచు పూఁగన్ను వేయుచులూగువారు। సాముజేసినయట్లుసాగిలబడిపడి బ్రొద్దుకై నిల్వకపోవువారు। బిరబిరనుచెట్లుచుట్టునుదిరుగువారు। నెయ్యిజితుకులునగ్నిలో వేయువారు। వైశ్వదేవాదిపూజలపరలువారు। కీర్తనలుసేయువారలకిందివారు॥ క॥ ఆశ్వాదేశముచేహరి। కీర్తనపరుడైనవాఁడుకృష్ణాయనుచున్। మాత్రిభజించినయొక్క

ము। మహా ర్తములో స్వామియొద్ద యుంచుకయుండగ॥ సీ॥ అనిశంబు నారా యణాయని చాల రేగి యాటపాటల మరుమాట లేక। పిలుచుచు ప్రత్యక్షములుగ గో రితల చూచు ధ్యానించి పరవశత్వమున బొంది। తెలిసి మరచినయట్లు తెలియక మరు పుతో నెందు నెట్లుండుట నెరుక పడక। నున్న చోటను తనకుండంగ నైవక బాలుని లీల నిర్భయము నగుచు। తిరుగు భక్తిని వెను వెంటదిరుగుచుండు। తడవులకు గన్న శ్రీరాము తల్లి భాతి। ముగుద సుతు బాయజాలని ముద్దులట్లు। పరమ కారుణ్యనిధి యైన హరిన్ప పాలా॥ క॥ వినవయ్య రాజచంద్రా। మనుజశరీరంబు లెస్స మంచిది యాగా। పునపురుషార్థము గను గొను। ఘనులకు నల్లారు ముద్దుగా విహరించుఁగ॥ మఱియును॥ క॥ శ్రీరామకృష్ణులకుపని। ధారుణి నెవ రైన తమ్మదలచినవారిఁ। జేరేదయ చేతను। నారయుయిందొక కథగలదదివినుపింతుగ॥ క॥ నారదము నిశిష్యుండా। త్మారాముడు ప్రముఖ్యుడాతండొక నా। డా రామకృష్ణమూర్తు ల జేరెన్నరొప్పవారు జేరిరి వారిఁ॥ క॥ ఈరీతికి బల్కు మానికి। నా రాజేంద్రుం డునని యెనయ్యా వాడే। తీరున జేరెను శిరిన। వారేరీతులను జేరవచ్చిరివారిఁ॥ వ॥ అనిన కృష్ణ దైవ్వపాయనుండిట్లనియె॥ గీ॥ శరణు శ్రీజానకీనాథ శరణు శరణు। శరణు శ్రీరుక్మిణీనాథ శరణు శరణు। శరణు శ్రీరామ రఘురామ శరణు శరణు। శరణు శ్రీకృష్ణ హరి హరీ శరణు శరణు॥ వ॥ అనుచు భూసురుండు శ్రీమన్నారాయణ మూర్తినింగూర్చి యిట్లనియె; సచ్చిదానంద నిలయా నీవు రామావతారంబున బాలుండవై యుండు నెడ విశ్వామిత్రుండు తనయాగసంరక్షణంబు కొఱకు మీ పట్టణంబు ప్రవేశించిన సభనింజూచి యాదేహేంద్రియాది ప్రపంచంబు కొఱకు సర్వంబు గాంక్షింపవలసెగాని దీనివల్లన య్యెడు సుఖంబు లేదెట్లన్న "నాత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" యని వేదవచనంబు పలుకుగావున కామంబులు నిరర్థకంబులై యుండునని మిమ్ముం జూచి విశ్వామిత్రుండు ఓ రామా యీ దేహికి దేహంబు సుఖదుఃఖమూలంబగుట నిశ్చయం బందుటను నాశ్యయిత్రిశాసంబుగలదు, తొల్లి శుకుండు తండ్రిచేతనుజ్ఞాతుండై మిథిలానగరంబు ప్రవేశించిన నతనిం జూచి జనకుండిట్లనియె, నీవు సంశయింపవలదు నీకు దేహేంద్రియాది ప్రపంచంబు గలిగినట్లయుండుఁ గాని నీకు దేహంబు లేదు నిన్ను నీ వెరుంగుమనిన నతండట్ల చేసెఁ గావున రఘువీరా నిన్ను నీ వెరుంగుమనిన మీరు నేనే బ్రహ్మమని యెఱింగితిరట మున్ను నిన్నెరుంగవే నీవు గురుశిష్యన్యాయంబు నడిపించుట తేటబడియెను నహహా యెంత విచిత్రంబు యయునుంగాక మారీచసుబాహువధయును, శివధనుర్భంగంబును, సీతావివాహంబును, పర

వృవ్యర్థమగునుబూడిదెలో హోమమైన రేంద్రచంద్రయథములకును॥ చ॥ నడ
కల నాక్రమంబులధనంబులజాతులవర్ధనీతులన్ ।యడవుల దానధర్మముల నాతు
లనంబుల వేషభాషల। నడలదిగంబరత్వముల చాటుటసద్గురురాజచంద్రుచే। బ
డకనవిద్యయున్ జడిసిపారునె ముక్తివధూటిచేరునే॥ వ॥ అదియునుంగాక॥ సీ॥
గుడిగుండములకొండగుహలకారడవుల కూరనారలనిరాహారములను । పం
డగపర్ణ్యాలపాడినిపంటను నేన్ను నేరంబులనోర్పుజనుల। నిప్పులనీళ్లను చప్పిడుపి
ళ్ళునుతీరాలతిరునాళ్ళతిప్పటలను।వడుగులపెండ్లిండ్లవన్నెలవాసుల వ్రాతలచ
దువుల పాదములను।విందులవినుకూళ్ళవితరణగుణములు।పొందుపోరటలనుపో
ణములను। మోతుమబ్బదయ్యాముక్తికాంతామణీ। నాథు జేరకున్న నరులకధిప॥
గీ॥ అనఘయామతించినట్టిదృశ్యములకు।తల్లివంటిచిత్తదర్శనమున। చిత్రపతిఫలి
తంబుజీవుడై కనుపట్టు। కానినింతవట్టిమానసుండె॥ గీ॥ రోతకూటిమనసురోసాన
కెపెనగు।త్రోవగానిముక్తిత్రోవపట్టి పోవనీడుదీనిపోడిమియామాయ। రం
పిలాడిజూడు రామచంద్రా॥ గీ॥ విషయలోలుడగుచువిశ్వాసవినుతుడై ।గురుల
వింతవినుచుకుటిలుడగుచు।చింతమునిగినట్టిశిష్యునకాత్మోప। దేశమియ్యరాదు
తెలియనధిప॥ సీ॥ ఆలస్యనాస్తికాహంకారవంచకద్వేషవిద్యాచోదదూషకు
లకు। పామండనిష్ఠురశతితకార్యకృతఘ్నకలహప్రియవిషయగర్వితులకు। స్తం
భనమోహనోచ్చాటనమారణవశ్యకుహకవిద్యవాదులకును।నటలోభ మో
హాతిశయకామ్యకరులకు చోదకోగ్రవియట్టిసోమరులకు। వినయభయభక్తి వి
శ్వాసఘనత చేత। గురులశుశ్రూష సేయని క్రూరులకును। స్వస్వరూపోపదేశం
బుసార్వభౌమ యెన్నివిధములకైననియ్యంగరాదు॥ చ॥ అనవిని ధర్మజుండనె
మహాత్మక యిందధికారలక్షణం। బునగురుసేవలక్షణాలబుద్ధిగజెప్పుమటన్న రా
జుతో।మునివరుడిట్లుపల్కెనుముముక్షుసమార్గము యోగచర్యలు। న్వినుతసుఖ
స్వరూపముసుధీసులవిందుగ వాక్ప్రవృత్తిన్॥ వ॥ ఇట్లనియె రాజేంద్రా సాధన
చతుష్టయసంపత్తిగల యతండధికారి వానిలక్షణంబులు నిత్యానిత్యవస్తువివే
కంబును యిహాముత్రార్థఫలభోగ విరాగంబును శమాదిషట్కసంపత్తియు
ముముక్షుత్వంబులనంబడు తద్వివరం బాత్మనిత్యంబు జగంబులనిత్యంబులనియె
రుంగుటనిత్యానిత్యవస్తువివేకంబనుసాధనంబు అందుల స్రక్చందనాదివనితా
భోగంబులుతుచ్ఛంబులు స్వర్గాదిలోకసుఖంబులునట్లయనియపవర్గసౌఖ్యం
బులుగోరకుండుట యిహాముత్రార్థభోగవిరక్తియను రెండవసాధనంబంతఃకర
ణనిగ్రహంబు శమంబు బాహ్యపంచేంద్రియంబుల నిగ్రహంబు దమంబనంబడు

కామ్యాద్యరిషడ్వర్గంబుల జయించుట శాంతియనిపించుకొనును శ్రుత్యాచార విశ్వాసంబుగలుగుట శ్రద్ధయనిపించుకొనును ఇట్లు శమాదిషట్కసాధనసంపత్తియును మూడవసాధనంబు శీఘ్రముం గారుంగగోరుట ముముక్షుత్వంబను నాలవ సాధనం బిట్లు సాధనచతుష్టయసంపత్తిగలయతం డధికారియనిపించుకొనునని మరియు నిట్లనియె॥ సీ॥ ఎవ్వడనేగం బుట్టితిసంసారమెవ్వనికక్కట యెందుగలిగె। యెందునున్నాడనో యేరూపువాడనో యేచందమేమందమేది త్రోవ। యొకనాడైని నేనుయున్న దున్నట్టుగా కన్నవారలతో నకలసిమెలసి। దలయెత్తగలుగు నాదైవకటాక్షంబు లేకయున్న దోయెవ్వఁడుగలఁడా। యనుచు దేహాదికభ్రమలన్నివిడిచి। వేదవేదాంతవేత్తలవిధవమెరిగి। నేడుగడయును గురుడంచు నెంచువాఁడు। స్వస్వరూపావబోధార్హజనుఁడు భూప॥ వ॥ అనియిట్లు వేదవ్యాసులిదు ధర్మజుని కెరింగించెననినవిని సంతుష్టాంతరంగులై శౌనకాదిమునులటమీదటి వృత్తాంతంబేమని చెప్పె నెరింగింపుండనిన॥ క॥ సురసేవ్యధర్మచరితా। సరసీరుహపత్రనేత్ర సన్నుతగాత్రా। నరకాసుర కంసాంతక। వరమునిహృద్యానకలిత వసుదేవసుతా॥

మాలిని॥ నిరుపమనిరవద్యా నిత్యసత్యాత్మవిద్యా।
సరసనుతవిధాతా సత్వసంగాతభూతా।
సురమునిగణరమ్యా సుందరాకారగమ్యా।
గుణవిబుధకలాపా గోపికానందరూపా॥

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వరప్రసాదలబ్ధ కవితావిలాస కౌండిల్యగోత్ర పవిత్ర కృష్ణయామాత్యపుత్ర వినుతగుణధైర్య మల్లనామాత్యప్రణీతంబైన శ్రీరామస్తవరాజంబను మహాప్రబంధంబునందు వ్యాసుండు సర్వప్రపంచకారణంబు మనంబగుటంజేసి తన్మనస్స్వాగంబు కారణాచార్యానుగ్రహంబునం జేయవలయునని ధర్మజుతోడం జెప్పుటయు, ధర్మజుండు గురుమాతాపితాసంసారవిరక్తులం దెల్పుమనియడుగుటయు, వ్యాసభట్టారకుండు మాయావర్ణాశ్రమాచార విరక్తిరక్తుల సద్గురుం జేరవలయునని చెప్పుటయు నన్నది ద్వితీయాశ్వాసము.



# శ్రీ రామస్తవరాజము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీరమ్యదివ్యశోభన।
కారుణ్యకటాక్షలబ్ధ గంగాధరదే।
వారాతివిఖండనల।
క్ష్మారమణీప్రియవిహార శ్రీకృష్ణహరీ॥

వ॥ దేవా సూతుండు శౌనకాదిమహామునులకిట్లనియె నట్లు వ్యాసుండు ధర్మజుంగనుంగొని యిట్లనియె॥ క॥ రాజేంద్రవిరక్తిమహా। రాజౌనధికారి మోక్షకాంక్ష్యాపేక్షన్। రాజశివయోగసిద్ధికి। రాజిగదిరుగంగవలయు రమ్యముతోడన్॥ సీ॥ అవనీశ యీయుత్తమాధికారి ముముక్షుండు నేతినేతి వాక్యంబులశరీర। బుద్ధీంద్రియప్రాణభూజలాగ్నిపవ నాకాశశబ్దస్పర్శగంధరూప। రసమాదిసంస్మృతిభ్రాంతులవిశ్వంబెల్లజడముదృశ్యంబునశ్వరమునగుట। యిదియేమియునుగానుయెట్లకోనిన్నిటుగలసినయెుకనేగానుకాను। మరియు నెవ్వండనినయూలమరిగిమరిగి। కాలెడిచోట్లోనివాండెట్లు శైలుదేరు। నట్టియూర్తియు తెంపును నినుము డింప। తన్నుదాగన్నగురుజేరదలచునప్పుడు॥ సీ॥ జడివానబట్టినచాదుప్పనవాదించువట్టిచదువులపోరుగట్టిపెట్టి। యుదరపోషణాకోరకాడిగట్టినట్టి యాభయతాపములనెల్లపదడగలిపి। నానావిధన్యాయనటనలుతనచేటు గానియొండొరులదిగానిదెరిగి। యేలోకసుఖములు బైలుపచారము లోనులోతారముట్టాలో తెరింగి। దేహవర్ణాశ్రమాచారదేశగాల। రూపరేఖాభిమానముల్ ద్రోసివిడిచి। పిన్నపెద్దతనంబులువిండిగలపి। యార్యశుశ్రూషసేయు మోక్షార్థుండధిప॥ గీ॥ పెద్దలనంగగొప్పపెనుకొండలంతేసి। వారుగారునట్టివారుగారు। తన్నుదానెగన్న ధన్యులెవ్వారైన। వారె పెద్దలనగవసుమతీశ॥ మత్తియును॥ సీ॥ ఏజాతివాడైననేనీతివాడైన నేజాడవాడైన నెవ్వడైన। రాజయోగసమాధిరాజ్యాభిషిక్తుండై వెలిచూపుచూలోచూపేదుచూపు। లోచూడచూడంగలోకాస్తమయమునైపండువెన్నెలబయల్నిండివెలుగు। తీలోనమైయంతలోతనువునమర్చియెదురుదన్నెరిగాడియెరుకమరచి। [illegible]చిత్సుఖోపాయుండగుచు। యెవ

నిద్రోరాజ్యమైయున్న యెఱుకమంతు। డాత్మవిజ్ఞానసద్గుణుండార్యపూజ్యు। డా
దిదేవుండు నా తండ్రియైన ఘనచరిత్ర॥ సీ॥ గురుకులవాసంబు గోరి సముచితాసనం
బుననుండి కాయంబు నిక్క। యరగంటి మాయను గెరవాసి మహిసహసారము
నగురుబూజన మొనర్చి। దృష్టి జడాజడ గృష్ణధ్యానమున నిల్పి కుండలిశక్తిని మేలుకొ
లిపి యుండు। పవనచిత్తంబులు ప్రవహింపగా జగజ్జాలంబు వెలిగింప జయలుపడిన।
పరమైన స్థిరియు పరోక్షపదవినోందు। వాంఛాఖేచరిముద్ర కీలుకొడినట్టి। రాజయో
గము సాక్షాన్మ నిజితార్థ। తుర్య ఘుస్యుండు కారణాచార్యవరుండు॥ క॥ యోగీం
ద్రమహామల్లుని। వాగీంద్రుని కైనసల్లవాసవునకై నా। భోగీంద్రపతికినైనా। యీ
గడిది యనంగవశమె యీశునకైనన్॥ సీ॥ ప్రణవనాదస్వరూపము నీర్ఘ ఘంటికా
రవమున బ్రహ్మరంధ్రమున మ్రోయ। బ్రహ్మరంధ్రధ్యాన పరవశంబున ముక్తి
కాంత నెదుర్కొనికళలదేల్ప। కళలంటియు పరతిగరగి బిందువు జార సమరసా
నందాబ్ధి చంద్రుడగును। చంద్రకాంతపు కోటిశశికిరణంబులు జారకప్పురమందు
చలువనొందె। సత్వశాంతివహించి నిశ్శంకుడగుచు। ధాత్రి నవధూత వేషావ
తారుడైన। సద్గురుస్వామి సేవించు సజ్జనుండు। పరమభాగవతారాధ్య పాలు
డగును॥ గీ॥ కంటిదృష్టి చేతగను విశ్వమెల్లను। దర్పణంబు గల్గ దన్నుగనును। ఆత్మత
త్వమార్గమారీతిగనవలె। నార్యదర్పణంబునందు జూప॥ చ॥ గురుకరుణాకటా
క్షమునకున్విదితుండగు భాగ్యశాలి శ్రీ। చరణసరోజరేణువులు సంకరవిష్ణువిధా
తలాదిగా। శిరమున నావహించి నుతి సేయుచు బ్రోచుచు గాంచవెంబడిన్। దిరు
గగ ఘాని కెంపులను దెల్పనసాధ్యములున్న వేన్నృపా॥ గీ॥ ఇట్టి గురుని జేరకెన్ని పో
కలుబోవ। చిత్తశుద్ధి లేదు చింతపోదు। మాయమాయలాడి మటుమాయమం
త్రాలదొలగిపోదు నాత్మ దెలియనీదు॥ సీ॥ కనునంట మేలుకొకగడ్డము ల్బెంచిన
బూచిబూచని మాయ బోనవెరచి। గురుసేవ సేయక గొడ్డడై తిరిగిన చీర లేదని
మాయ సిగ్గుపడును। తన్నుదా దెలియక తలక్రిందుగాబడ్డ విద్యవాడని మాయ
చోద్యపడును। యానంద మొందక నాలుబిడ్డలవీడ దోసరారని మాయరోసిపో
ను। యంత తాగాక దేహంబు నాగ్రహింప। శూన్యగాడని యీ మాయ దైన్యపడు
ను। తెలివి వొందక నూరూరనలమటింప। దేశగీడని మాయ డాదిరుగబడును॥ క॥
ఎన్ని విధంబులనైననుయున్నదియున్న ట్టికన్న యోగుల సేవన్। తన్నే తానెరుగ
కపోదన్నామాయాప్రపంచమరితియు దానై॥ క॥ ఈ రీతి తన్నుదాగను। కారణ
గురుమూర్తి జేరి ఘనవినయవిధేయ। యారూఢి నిశ్శ్రమపలు। నారయుసలుపంగ
వలయు మనవి వొకన్నన్॥ గీ॥ పరమగురుని జేరి వ్యాళశాబ్దములు లెస్స। నాత్మయను

నంగమాను స్థానమనగమరియు। ప్రగసద్భావమునునసబడినయట్టి। నాల్గువిధ ములశుశ్రూషనడుపవలయు॥ సీ॥ నాల్గుశుశ్రూషలనడకలు వేర్వేరవిభజింతు విన వత్స్యవిమలచరిత। యార్యాభిమతపదార్థానుకూలము సేయునదియాత్మశు శ్రూషనడుపవలయు। ఆపాదమస్తకాభ్యంజనాతిథ్యము లనసంగశుశ్రూష లనగనొప్పు। క్షేత్రగృహారామసీమలనటుల స్థానమర్మాణ శుశ్రూషలాడలా యె। తాత్రదైవంబుతల్లియుతండ్రికర్త। యేడుగడయును గురుడంచు నెంచిభక్తి। చేయుసద్భావశుశ్రూషసిద్ధమిట్టు। లెరిగినడుపంగవలయును గురునిఁజేరి॥ క॥ ఇటునలెసేవలు సేసే। భటునకు బోధింపవలయుపరమగురుండా। కుటిలప్రపం చభావన। నటలన్నియుదెలియశాస్త్రసమ్మతిననఘా॥ సీ॥ ఎరిగిమెరుంగనియి ట్టుంది తెల్వికైనొదురెసంగళయున్నయెపకశైట। సిలుచున్న చాయనుపోలి కారోపింపఁబడుకల్పితుండహంభావమునను। జచ్ఛక్తితో సదాశివుడనబడుక ల్పితాజ్ఞానభావమాయాస్వరూపు। మఱియునా ప్రకృతియావరణవిక్షేపమా శక్తులన్యామోహజాడజూడ। తనకిందభావమనిపించుకొనును మొదట। యా వరణశక్తిచేహంబుప్రకృతి। భావమునపరాశక్తితోపరమహేతు। డనగఁజెంపి ట్టుకల్పితుండవనినాథ॥

### మాయావిచార ఘట్టము.

క॥ పరమేశునియవయవమే। భారిపారివిక్షేపశక్తిమూఁడహములకున్। మ రియాకారమైబారెరిగెమహత్తత్త్వమనగపృథ్వీరమణా॥ గీ॥ అందహంకార ములపాటియందునధమ। మైనభూతయహంకృతియందువిశ్వ। కారణాఖ్య తమై సుకల్పినాది। శక్తితోజ్ఞానవిస్మృతిధూర్జటియనంగ॥ గీ॥ మఱిజగత్సాక్షి దేహియైమధ్యమోహ। మనెడితైజసాహమునువర్తనవిస్మృతిర। జోగుణంబుని చ్ఛాశక్తితోగుణింప। పతజ్ఞహైరణ్యగర్భుఁడటండ్రుబుధులు॥ గీ॥ మోహవి స్మృతినుత్తమోహాశాహైరికా। యహముపిశ్వదేహియురయసాక్షి। కంబుజ్ఞాన శక్తిగలసివిరాట్పురు। షుండువిష్ణుడనగసుస్థిరాత్మ॥ సీ॥ కల్పితపురుషుండుకిడు రుద్రతత్త్వంబువలనబీజభూతములకుబీజ। మారజోగుణమున హైరణ్యగర్భుం డుకర్మేంద్రియములకుకణగిసాక్షి। ఖండావిరాట్పురుషుండునవిష్ణువు జ్ఞానేం ద్రియములబీజంబురాజ। సగుణసత్త్వైక్యతపరగనంతఃకర ణములకుబీజంబున నుతనలడు। యఖిలదేహేంద్రియసమష్టియందునుండి। జీవరూపంబులైప్రవేశిం చితానె మరికియాశక్తియు క్షుద్రమరచితన్న। బుద్ధికల్పనభ్రాంతిచేపురుషుం డయ్యె॥ క॥ నానాదేహోపాధుల। నానాత్వభ్రాంతినొందునాదివను చున్।

శాస్త్రవాసనం బ్రహసద్విదులు॥ గీ॥ కాయపోషణంబుగంగానదీస్నానమాదిగా
గగల్గునట్టిలశౌచములును దేహవాసనలు మూఢుడగువాడు। తగిలినడుచుచుం
డు ధర్మచరిత॥ చ॥ కాపునవాసనాత్రయముకష్టపుకర్మమునిందులోపల। బ్రూప్రు
శుచెందులోలదము జెప్పగరోతలుమెంతమాత్రమే। వావిరిమెంచగానరకపా
సదమీపటుహీనజన్మము। ట్టీవిపరీతముల్విడువ నెవ్వడెరుంగు నతండెధీరుడో॥
ఉ॥ లోకములోడిదేలసభలోచదువుల్లదువంగగోరునా। పోకలుపోవనేలమల
మూత్రపుకొంపనుదానునాత్మగా। జేకొనిసల్పుతీర్థములుశీలములేలనటంచు
వాసనల్। గైకొనకుండువారలధికారులు మోక్షమునొందగాన్నృపా॥ క॥ మన
సేసర్వజగంబులు। మననవ్యతిరిక్తమైన మాయలుగలదే। మనసేసజ్జనసంగతి।
గనగామానసజయంబుగల్గున్నృపాలా॥ అంత॥ గీ॥ తన్ను నెరుగగోరుతలపునుబు
ట్టును। దృశ్యమార్గమెల్ల తెలియబడును। నప్పుడాత్మతత్వమతిశయంబుగగల్గు।
పాండవాబ్ధిచంద్రపార్థివేంద్ర॥ సీ॥ రాజేంద్రవినుమనఃప్రాణంబులాత్మగాదిన్ని
టినెరిగెడిమెరుకయాత్మ। తాపత్రయంబులుతలపులు నాత్మగా విన్నిటినెరిగెడి
మెరుకయాత్మ। పుత్రమిత్రకళత్రభామ్యాదులాత్మగా దిన్నిటినెరిగెడియెరుక
యాత్మ। యష్టాంగయోగాదినిష్ఠలు నాత్మగాదిన్నిటినెరిగెడియెరుకయాత్మ। య
ట్టియాత్మనీవుయఖిలంబులును నీవు। నీవు నేనటన్న భావమీవు। గాన వేరు లేదు కై
వల్యపదమార్గ। మేనటంచుదలచు నెరుకనీవు॥ క॥ వినుమిట్టివిధమున జెప్పిన। మునివ
రునకుధర్మజుండు మోదముతోడన్। వినయభయభక్తిపరుడై। వినువింపుండింక
నేమివినగావలెనో॥ గీ॥ అనుచుధర్మజుండునా పరాశరసూను। తోడబలుకునపు
డుతోలుతదేవ। తత్వమార్గమెల్లతగజెప్పకోరకునై। వినుమటంచుబల్కె వే
ట్కతోడ॥ క॥ జీవేశ్వరతనువులునా। ల్గావిధమెరుగంగనీకునఖిలము దెలియున్।
భావింపబ్రహ్మబోధము। నీవై యుండంగవచ్చు నిర్మలచరితా॥ వ॥ మరియుజీవేశ్వ

## జీవేశ్వర తనుచతుష్టయ ఘట్టము.

రతనుచతుష్టయలక్షణం బెట్లంటేని॥ సీ॥ త్వద్దృష్టికర్ణజిహ్వాఘ్రాణములునైదు
శబ్దాదులైదు వచనములైదు। పాదపాయూపస్థపాణివాక్కులునైదు జాగ్రత్తా
దిబంధుల జాడలైదు। క్ష్మాజలాగ్ని పవనాకాశమహాభూత పంచీకృతకదంబపం
చవింశ। తిఫకారస్థూలదేహమిందుకవస్థ జాగ్రత్తు నేత్రముల్ స్థానమరయు। యు
క్తభోగంబుమరి క్రియాశక్తిరాజ। సగుణములు విశ్వోఽభిమానిలగనకార। మర
యమాత్రక యాత్మజీవాత్మయాలరా। వ్యావహారికజీవులకుభావరేణ్య॥ క॥ స్థూ
లంబిసవిసంజ్ఞల। జాలముతద్వ్యాసహవశతమాత్మాంగం। బీలోనెనిమిదిపురము

ల।చేలలితంబగు క్రియాశక్తి జెప్పెద వినుమీ॥ గీ॥ జ్ఞానకర్మేంద్రియంబులు మాన
సాది।కరణములు నాల్గు తమమును కర్మకామ।ములును భూతంబులును ప్రాణము
లును గూడి।యష్టపురములలింపుగాంగ మగున్నపాల॥ సీ॥ కలలవస్థలును స్వికంఠ
మిచ్ఛాశక్తి తైజసుండభిమానితనర సాత్వికంబు కామము మాత్రుకయును స్వే
చ్ఛాభోగమందుల వ్యాపకమైయినయాత్మ। యంతరాత్మవునతండల ప్రాతిభాసి
కయాత్మడీషదినోంజ్ఞలందులింగ। కాయమీస్థూలసూక్ష్మద్వయాంగంబులకా
రణంబగుటచే కారణాంగ।మగునునిదురందుస ర్వేంద్రియంబులడగి। యొప్పగ
లిగినభంబుండ నేర్పడంగ।నన్నవచనంబునగుటవీరగ్నిగలదె। యిందులకు పాత్రి
యై ధాత్రియొసగునయ్య॥ గీ॥ పంచవింశతితత్వంబు నెంచనిట్లు।లగునువట బీజగ
తికారణాంగమిండు। వస్థసుషుప్తియుహృదయంబు వాసమగును। ప్రాజ్ఞుడభిమాని
యిందుకుద్రవ్యశక్తి॥ క॥ కనకానందము భోగము। ఘనతామసగుణము మాత్రుక
మకారంబా।వినువ్యాపకాత్మపరమా। త్మనవతడే పారమార్థికాత్ముండధిపా॥

క॥ కారణమీపదిసంజ్ఞల। మీఱునవస్థాత్రయముల మించినవస్థే।
కారణతనువునకు మహా। కారణమను దేహ మింకగలదున రేంద్రా॥

వ॥ ఇట్లవస్థాత్రయంబునకు సాక్షియై కారణంబునకు మహాకారణం
బు శరీరమెట్లన్న పంచభూతోత్పత్తిహేతువులగు సద్యోజాతవామదేవా
ఘోరతత్పురుషేశానులను పంచబ్రహ్మశరీరంబులకు పంచభూతంబులు నివృ
త్తిప్రతిష్ఠావిద్యాశాంతిశాంత్యతీతపంచకళలు పంచవిషయంబులు పరాశక్త్యా
దిశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తిచ్ఛాశక్తులు పేరిక స్వరూపంబులైన పంచప్రాణం
బులు పంచాక్షరియై పంచేంద్రియంబులు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులనునీ
పంచకర్తలంతఃకరణంబులిట్లిరువదియైదుతత్వంబులంగూడి మహాకారణశరీరం
బగునిందుకవస్థతుర్యంబభిమాని ప్రత్యగాత్మజ్ఞానశక్తిశుద్ధసత్వగుణంబుమా
ధిష్ఠానంబు నాదంగభోగంబు ఓంకారంబుమాత్రుక వీనియందు వ్యాపకంబగు
నాత్మనిర్మలాత్మయతండె కూటస్థచైతన్యుండిందునోంకారంబుండుట నదియే
మూలప్రకృతి ఈపదిసంజ్ఞలుగలది మహాకారణంబను దేహమీనను వతిసంఖ్యా
సంజ్ఞలమీఱిజ్ఞప్తిశిఖామాత్రంబుగా విశేషించినదియె తుర్యాతీతం బిట్లుశివత
ను చతుష్టయంబిక నీశ్వరతనుచతుష్టయలక్షణం బెట్లన్న పృథివ్యాపస్తేజోవా
యువ్యాకాశ చంద్రసూర్యాత్ములను అష్టమూర్తులీశ్వరునియొక్క విరాట్రూ
పంబగు స్థూలంబిందులకుత్పత్తియవస్థయభిమాని బ్రహ్మక్రియాశక్తి రాజసా
హంకారంబు సూర్యస్థానంబు సర్వకర్తృత్వభోగంబకారంబుమాత్రుక వీనిలో

డఁగూడి సకలంబగునాత్మభూతాత్మ యాతొమ్మిదిసంజ్ఞలుగల విరాట్పురుషు
డింక సకలభూతంబుల కాశ్రయంబగు హిరణ్యగర్భశరీరం బెట్లన్న దశదిక్కులు
శ్రోత్రంబులు, వాయువుత్వగింద్రియంబు, సూర్యుండు నేత్రంబులు, వరుణుండు జి
హ్వేంద్రియంబు, అశ్వినీ దేవతలు ఘ్రాణేంద్రియంబు, వహ్ని వాక్కు, ఇంద్రుండు క
రంబులు,ఉపేంద్రుండు పాదంబులు, బ్రహ్మ గుహ్యంబు, మృత్యువు గుదంబు, జ్ఞా
తృవంతఃకరణంబు, మనంబు చంద్రుండు, బుద్ధి బ్రహ్మ, క్షేత్రజ్ఞుండు చిత్తం, బహం
కారంబు రుద్రుండు, నీచతుర్దశ దేవతలతోఁ గూడినది హిరణ్యగర్భశరీరం బింద
లకవస్థితి విష్ణుఁ డభిమాని యిచ్ఛాశక్తి సాత్త్వికాహంకారంబు చంద్రస్థానంబు సర్వపా
లకత్వభోగంబు కారంబు మాతృక వీనితోఁ వ్యాపకంబైన యాత్మ సూత్రాత్మ యీ
తొమ్మిదిసంజ్ఞలంగలది హిరణ్యగర్భశరీరంబగు, నీవి రాడ్ఢిరణ్యగర్భములకుఁ గార
ణమైనది యింద్రస్వరూపంబై నయవ్యాకృతశరీరంబు దీనికి ప్రళయావస్థ రుద్రుం
డభిమాని ద్రవ్యశక్తి తామసాహంకారంబు నగ్నిస్థానం సర్వసంహారభోగంబును
మాతృక మకారంబును వీనితోడం గూడి వ్యాపకంబగు నాత్మ శుద్ధాత్మ మరియు న
వ్యాకృతంబన మహదహంకారంబనుటనది యేత్రిగుణగర్భంబును బిందూపాధి చేది
ద్విలాసంబై పంచభూతంబులకుం గారణంబగు మరి విరాడ్ఢిరణ్యగర్భయవ్యాకృ
తులను యీశ్వర మాయోపాధిశరీరంబులకు సాక్షి రూపంబగునదియు మూలప్ర
కృతి యది స్వరాట్టనంబగునదియు యనాహతనామంబునునదియు పంచబ్రహ్మం
బునునదియు పంచభూతంబును యట్టి మూలప్రకృతిశరీరంబున కవస్థ సర్వసాక్షి
యీశ్వరుండభిమాని శుద్ధసాత్త్వికాహంకారంబు జ్ఞానశక్తి బ్రహ్మాండాతీతస్థా
నంబు సర్వకర్తృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వ సర్వనియంతృత్వ సర్వ
భోక్తృత్వ సర్వైశ్వర్యాదిసద్గుణైశ్వర్యంబై భోగభోంకారంబు మాతృకయం
దుల వ్యాపకంబగు నాత్మ మహాత్మ ఈతొమ్మిదిసంజ్ఞలంగలది మూలప్రకృతిశ
రీరంబగు నీపిండాండ బ్రహ్మాండంబులగు యష్టశరీరంబులు వాచ్యార్థంబనుపించు
కానునీశ్వర రూపంబిది దృశ్యంబు వీటికి సాక్షి స్వరూపంబగు చిత్తు యీయెనిమి
దింటి గూడిన జ్ఞానోపాధిచేత శబ్దబ్రహ్మంబనిపించుకొనుచు వీటికి నతీతంబగున
దియ యీశ్వరుని తుర్యాతీతదిట్టిజలశర్కరన్యాయంబున నిత్యముక్త శుద్ధబు
ద్ధస్వభావ సత్యప్రజ్ఞానఘనసచ్చిదానంద నిత్యపరిపూర్ణంబగునది యెనిష్కళబ్ర
హ్మంబది యెనీవనియు సిపదంబు చెప్పినసది తత్త్వమస్యాది మహావాక్యలక్షణంబు
తత్పదత్వంపదలక్ష్యార్థంబు నసిపదంబఖండంబుగా బోధించునట్లుగుటం జేసి తత్ప
దవాచ్యార్థంబగు జీవేశ్వరాదృష్టశరీరంబులు దృశ్యంబ యెఱిగి పరబ్రహ్మస్వ

రూపంబవై సుఖంబుండుమనిమూరియునిట్లనియె॥ గీ॥అఖిలవ్యవహారమునకాధారజీవా
త్ముడంత।రాత్మసంసారమునననుభవించుచుండు। యీలరుజీవాత్మపరమాత్మయం
తరాత్మ।వ్యావహారికిసాక్షియౌనతడెభూప॥క॥నదియందునోడనడచిన।నదిపొం
తలనున్నదరులునడుచున్నమబ్బున్। గదలినచంద్రుడుగదలును। గదలినజలమం
దునడుసుగదలినరీతిన్॥ క॥ దేహంబుచావుపుట్టువు।దేహికిననునట్లునాత్మదివ్యం
బైనన్। దేహావస్థగలిగెను। దేహియుననుగాపురంబుదెలియకనధిపా॥
క॥ శ్రీరామునిమనుజత్వము।దూరంబునదోలగ్రోచిదోరయగనివే।
నారాయణుడనుకైవడి।నారయకూటస్థమాత్మయందైక్యమగున్॥ క॥ నది
దాటిపదుగురేగుచు। తుదితను లెక్కింప మరచితొమ్మండ్రింకన్। పదుగురు లే
రనిసివే। పదియావాడట్లజీవపరమైక్యంబుల్॥ మ॥ జననాథావిపరీతసంశయ
ములజ్ఞానంబువిఘ్నత్రయం।బనగాముక్తికివాటినిందోలగిబ్రహ్మానందవారాశి
లో।మనసుల్ దీరగనోలలాడునిదియేమర్మంబుసత్యంబుగా।వినుమీనీకికజీవనం
స్మృతులు సోకన్ రావుయూహింపుమా॥ క॥ వినవోయిధర్మనందన। తనుదాగ
నుగొనుటకంటెధర్మము లేదై। నవైరాగ్యంబుపరత। యనుపలె లేదున్న నా
త్మయోగముగలదే॥ క॥ యిన్నిలజెప్పవలయును। తన్నేతానెరుగుకొనకుతప
కన్యంబై।గన్నదియంతాదబ్బర।నిన్నేనీవెరుగనీవ నిక్కంబధిపా॥ క॥ ఈరీతి
నెదునగాను। పారెడిపిండాండమాదిబ్రహ్మాండంబుల్। సిరుగజేసినవాడే। వై
రాగ్యపరతులందువాడున్నృపాలా॥ క॥ పలుమాటలపనియేమిక। గలవంటిది
మాయదినికలలోనైనా। గలవనిజూడగబోకుము। కలిమియు లేమియును లేని
గానృపనభూపా॥ క॥ సకలప్రపంచంబునువా। చికమనిదెలిసిన నటువంటిచిన్మా
త్రజ్ఞ। ప్తికళామాత్రంబేనను। చుకంవికము లేనియోగిసుఖభోగ్యుడగున్॥ సీ॥
సంసారియగువానిజన్మంబుభీవ్యధా సంసారియగువానిజాడవ్రోత। సంసారియ
గువానిసంగంబుకొరగామిసంసారియగువానిసాటిలోటి। సంసారియగువాని
సంపదలాపద సంసారియగువానిజమువుజాలి। సంసారియగువానిసౌఖ్యంబు
దుఃఖంబు సంసారియగువానిజాతినడత। పాపసంసారియగువాని బ్రతుకులతు
కు। దైన్యసంసారియగువానితవులుతెవులు। కర్మసంసారియగువానికాంతవళ
ధి।రోషసంసారియగువానిబుజువువెతలు॥ సీ॥ సంస్మృతికిదుర్దుఃఖసంతాపహే
తువు సంస్మృతియతిక్రూరసాహసంబు। సంస్మృతిమర్దోషసంగమలాభంబు సం
స్మృతిదుష్కర్మసంగరంబు। సంస్మృతియాశాపిశాచవికారంబు సంస్మృతిదారిద్ర్య
సంకటంబు। సంస్మృతిదేహాత్మజర్ఝరీభూతంబు సంస్మృతిపాషండసహ్మితంబు। సం

స్మృతియకోతమూలంబు చంచలంబు। సంస్మృతియ నారకంబును జాలిజాలి। సం
స్మృతియ ధర్మఘాతియు జన్మహాని। సంస్మృతియ సర్వకథలు జనులకెల్ల॥ సీ॥ తను వె
త్తుటకు జాల దాతన బవిశారద నెరిగియు సిగ్గేల నెసగడకట। పుట్టినప్పుడేది పొందిన
నెళవేదియున్న తావెక్కడ వెనలు నేది। యింతయు జూడంగ హేయకరంబును
పుట్టంబు రోతలమూలమిట్టు। లుచ్చరింపగరాని యుచ్చబ్రతుకులకై నిక్కమె
తాను మానిసివటంచు। తెయ్యు యోనింట నుండగా నర్మమగునె। శుక్లశోణితమిశ్ర
మాంసాల దేహ, కారణంబై నలింగంగఘాతియగుచు। చిత్తబయము నతన్ను
దా జేగనలదె॥ క॥ వేయేల నొక్కమాటను। మాయాసంసార మెల్లమడియింపు
టకై। యూయము జెప్పెద మనసే। కాయేంద్రియ విషయ కార్యకారణమనఘ॥ క॥
మనసే మాయాజగములు। మనసే సంసార దోషమార్గము సర్వం। బును మనసే
కానిమరే। మిది లేదనుచును నెరింగి మెలగు నృపాలా॥ సీ॥ మనసయా సంసార మా
యావికారముల్మనసయా లౌకిక మహిమలన్ని। మనసయా పాపంబు మనసయా
పుణ్యంబు మనసయా లోకాది మత్సరములు। మనసయా జీవులు మనసయా జన
ములు మనసయా సుఖదుఃఖ మలినములును। మనసయా స్త్రీలును మనసయా పురు
షులు మనసయా యఖిలాశ్రమంబులెల్ల। మనసు గాకున్న దొకటైన మాయ లే
దు। మాయగాకున్న దొకటైన మనసు లేదు। యఖిలజగము మనోమాయలగుట
దెలిసి బ్రతుకనేర్చిన వారలు బ్రహ్మవిదులు॥ క॥ వృథలు సుమీ సంసారము। వృథ
లు సుమీ పుణ్యపాపవితతి జగంబుల్। కథలు సుమీ పురుషార్థము। బుధులు సుమీ
వీటినెరుగు పుణ్యులు ధరణిన్॥ క॥ అపరిమితానందంబుల। నుపశాంతిని బొందనున్న
యోగులు విబుధుల్। విపరీత సంశయంబుల। చపలంబగు ధర్మతనయ సజ్జనవిన
యా॥ క॥ రానీకు చిత్తవృత్తులు। పోనీను సమాధియందు బుద్ధిదలిర్పం। గానీకు యో
గవిఘ్నము। లేనీకు విచారమేమి తెలివందిన్నృపా॥ ఉ॥ శ్రీగురుపాదపద్మములు చి
త్తమునందల పోసి విశ్వము। స్వేగమె కాల్చివేసి తెలివే పరమాత్మపదంబటంచు
నై। పై కురి మేర లేని సుఖమందు సమాధిని పోలలాడునా। యోగియ జీవముక్తుడు
సుఖోన్నతుడౌను ధర్మనందనా॥ చ॥ గురుకృపగల్గి బోధ మొనగూడి పరాపరవ
స్తువె నయా యొకట బయల్గలంచి మదినేకము సేయుచు సంశయంబులన్। దొర
గినజీవముక్తులకు దుర్గన సంస్మృతి దోషమెన్నడున్। బొరయదు చిత్తవిభ్రమము
పుట్టదు సున్మినృపాలచంద్రమా॥ చ॥ చదువులు పెక్కుగా జదివి శాస్త్రవివేకము
నేర్చి ధర్మముల్ [illegible] యోగవిద్యలను బోధల నెన్నిటి విప్పి యాగినన్। మృదువగు
రాజయోగము నిమేషమాత్రము బొందకుండిన। న్వారలకు చిత్తసంశయము

దృశ్యంబుగాల్చి వేసినచిదాకాశరూప। మరికాలుఘడియలో మానసవృత్తు
లామసుప్తు తెల్పులగెల్చుదురితదూర। క్షణములో పలబ్రహ్మసాక్షాత్కరింప
రాగ మొందగ నేర్చిన యోగిచంద్ర। లేశమాత్రంబులో బ్రహ్మదేశమంత। యెల్ల
నేర్చినసద్గురులీలలోల॥ క॥ క్షేత్రత్రయదీక్షాత్రయ। నేత్రత్రయలక్ష్యములను ని
న్నెరిగినవా। నిత్రాణగనుమునీశా। ద్వాత్రింశత్రయ తనుత్రితత్రయమాత్రా॥
క॥ సద్గురుడవైనని న్నే। సద్గతిగా నెవడు దలచి సంతసమందు। న్నద్గతిపరుండు వా
డే। చిద్గగనానందసీమ శ్రితజనసోమా॥ క॥ మునిచంద్ర నీప్రసాదం। బున నానం
దాధిపత్యమునకర్హుండనై। తినినీప్రభావమేమని। కొనియాడంగలుగువాడకో
ర్కులగాదే॥ గీ॥ తనయుడైనవాడు తలిదండ్రి సుందర। విద్దె చూడనదియు ము
ద్దుగాదె యట్లనన్ను మీరు హర్షించి సతతంబు। ప్రీతిపోషణంబు సేతురయ్య॥ గీ॥
తల్లితండ్రిగురుడు దాతయు దైవంబు। యిహపరంబు నీవె యేడుగడయు। గాగ
నాహృనంబు కల్యాణయుక్తమై। యొప్పుచున్నదయ్య యోగివర్య॥ గీ॥ జయము స
ద్గురురాయ సజ్జనవిధేయ। జయము శ్రీసర్వయోగీంద్ర హృజ్జలధిచంద్ర। జయ
ము దైవపాయనాఖ్య విశ్రాంతి సౌఖ్య। జయము శ్రీవ్యాసశుద్ధవాసనరమేశ॥ గీ॥
అనిబహుప్రకారము సధర్మతనయుండు। సన్నుతింపమౌని సంతసించె। సనుచు శౌ
నకాదిమునులను సెరిగించి। సూతుడనియె నిట్లు ప్రీతితోడ॥ క॥ మునిముఖ్యులార
ధర్మజ। డనయము గొనియాడ మౌని హర్షముతోడన్। ఘనయోగ్యుడ్ శుభ
మున మనుమని దీవించెను దీ.ఘమనుమని బ్రీతిన్॥ క॥ దీవించి ధర్మతనయుని। భా
వించి మహాత్మ నీవు బ్రహ్మైక్యానం। దావిర్భావసుఖాకృతి। జీవన్ముక్తుండవగుము
చెలగిల్లనియెన్॥ ఉ॥ కోరిక దీరలోనిదుర గూరికి నెమ్మదినుండుచిత్తమె। వ్యాలిదివ్య
వార్త చేసుఖము వాస్తవముల్ మరియన్యులెవ్వరి। న్నీరికి సాటిగా బలుక నెక్షి త
నంబులు బ్రహ్మతోల్లిబోల్। భారతుశిష్యపాదములు ధర్మముగాశిర సావహింప
డే॥ భావ శేణ్య యుట్టిపుణ్యాత్ముడగు యోగి। నిష్ఠుడగుచు శాంతభ్రిష్టవలెను। వ
దిపిశాచబాలమత్తుల పోలికె। ధాత్రి దిరుగు నొక్కతలపు లేక॥ సీ॥ అలయవస్థా
త్రయములదాటి మదిలో నరజతాద్రి పటికంపు రాతికైని। నిండు పున్నమ నాటి పం
డువెన్నెలవలె పట్టపగటి పట్టబయలు పోలె। నిండి పండి యొరిగిని బిడీకృతానంద
మై వెలుగు తుర్యసమాధియందు। చిన్మయజ్ఞప్తిమైన స్వాత్రమంత్రమై శోషించి
యదిదానవెలుగుచున్న। బ్రహ్మవిద్యాధురంధరుల్ బాహ్యమందు। జాలిపణ్ణాత్రి
[illegible] సంస్కృతులనుచున్ సన్యసించి నిస్సంసారసంగులైన। యఖిలవ్యవహారంబ
[illegible] విటరగిన॥

## జీవన్ముక్తలక్షణ ఘట్టము.

సీ॥ ఆకాశమధ్యమందాకృతి వెలిలోను విషయశూన్యంబున వెలుగుచుం
డి।యంబు నిమధ్యమందాకృతి వెలిలోను పూర్ణమై యానందమునను గ్రుంకు। న
ట్టిమహాయోగి యఖిలసంచారుడై యొక్కచో యాచారము ద్రిదనరు। నొకవేళ
సంసారియై యుప్పొనచరియించు నొక్కచో వైరాగ్యముద్ధరించు। నొక్కచో భోగి
యొకచోట యోగియనుచు।। పెక్కుగతులను దిరుగుని పృథ్విలోన। యిప్పుడి
ట్లనంగరాదెప్పుడెట్లో। యట్లకానుంట నిశ్చయంబవనినాథ॥
సీ॥ ఖంబ్రహ్మమనుచు నాకాశాత్మయనుచును వేదప్రమాణముల్ విమలవా
క్యములవినంబడుగాననల చిదాకాశంబు నిరతిశయానంద నిరుపమాన। నిర్మ
లనిర్గుణ నిరవయ నీరంధ్ర నిత్యనిరాకార నిర్వికల్ప। నిర్విశేషానంత నిరుపద్రవని
బద్ధనిష్కర్మ నిస్సంగ నిర్వికార। మై వెలింగెడు బట్టబైలాత్మ గాంచి। మఱచియు
ఖలంబు మఱువని మాత్రమెఱుక। కల్గునవధూత బాహ్యనిష్కర్ష జేసి। కూహక
పువిద్యసిద్ధులఁగోరఁడధిప॥ మ॥ మణిమంత్రౌషధయంత్రతంత్ర జపహో
మద్రవ్యయోగంబులం। దణిమాదుల్ గగనాదియాన మహిమాద్యంతం
బులౌసిద్ధులన్। గుణసామ్యంబులుమాయలన్నియును ముక్తుల్ వీటికై కోరు
నా। త్మను నాచార్యముఖంబునన్ దెలిసి భోగుల్ గాంతురుర్వీశ్వరా॥ క॥ ఆల
స్యమే బ్రహ్మము। బయలై యుండంగబట్టబయలై జగముల్। యాలోననడగు
నంతట।నీలోననసీవునిల్పినిందుసమాధిన్॥ క॥నింజసమాధినిబైలై।యుండినస
కలంబు మఱచియున్నని గన్నవిట్లుండినవారికిధర్మజ। కొండొకధర్మంబుగోరగ
డునె చెప్పుమా॥ క॥ అనిశంబిట్లుసమాధిని।తనివొందినవారిమహిమ దలపగవశ
మే।కననేరకొంత్రోవల జనువారల భాగ్యమెంత చెప్పగవలయున్॥ గీ॥ ఆత్మ
నెఱిగినయట్టియవధూతసంచార। మెవ్వడెఱుగునయ్య యెదురుగాను। జూపరం
బులైనకాపట్యమార్గత। దగులుచుండ్రుగాదెధరణినాథ॥ క॥ సతతంబాత్మస
మాధిని।గతకల్మషభావుడగుచుగడతేరవలెన్।ధృతినిట్లుచేయమంటిన।మతిహీ
నుండగుచువిషయమగ్నతజెందున్॥ గీ॥ మనసువృత్తిలేక మఱియరతుణమైన।
నుండదగుటనలయఖండవృత్తి।నుంచవలయుగానియుంచకయుండినా। తేచివి
షయములకునేగివిడుచు॥ మ॥ అమనస్కంబుప్రతిక్షణంబుగనగా నానందభో
గంబునన్।విమలంబై హృదయంబుచల్లనగుచున్ విశ్వాత్ముడై యోగనిర్మమ
తాహంకృతిజీవముక్తుడగుచున్ రాజిల్లునిక్కీయనగా।సమయాతీతసమాధివృత్తి
మునసిస్సంగాత్ముడౌ భూవరా॥ మ॥ అగ్నిశంబుంటరమాత్ర[illegible]డనియోజితంబడాకార

నై కారికా। జనవాంఛావిషయంబులఁ దగిలి దుస్సంసారసంతాపము। గ్లాని
ముం బడలయెత్తలేక బతిమాలుఁ గన్నవారెల్లగా। పునదుస్సంగవిరోధి
గావలయుఁ జీవుఁడాత్మసత్సంగిరామ॥ చ॥ ప్రతినిమిషంబు బ్రహ్మమునభావముగూ
ర్చి నుండువారుదు। ర్మతులు నుపాసకుర్వ్యసయ నుగ్నులునై చెడిపోదు రంత
టన్। గతజలసేతుబంధనముగా దెవివేకము లెంచి చూడగా। మతినిది గాంచినీ
వు మరిమర్మమునొందుము పాంథవాగ్రణీ॥ శా॥ సర్వజ్ఞత్వముగల్గియాత్మగ
నియున్సంసారదూరుండునై। నిర్వ్యాసైక్యసమాధిమాత్రము వినా నేర్పెల్లమౌ
నైన్యనమన్। గర్వగ్రస్తులు బోవు బ్రహ్మపదసాక్షాత్కార సౌఖ్యంబునన్। బ
ర్వాన్నైరమచిత్తముందుజయమున్ బ్రహ్మావిశేషాత్మకా॥ ఉ॥ కాయము నిత్యమున్
దెలివిగానకమంత్రలయాదియోగసా। ధ్యము ముత్రైనసిద్ధులను బ్రజ్ఞలు గాదల
పోసిమూఢులై। మాయలనందువారునదు మంత్రప్రయోగులు గాసిముక్తికిన్।
డాయఁగలేరు వీరలకు దంభమె మోక్షము లెంచిచూడగన్॥ ఉ॥ అంబరయానసి
ద్ధులకు నాసలుసేయుచు మంత్రతంత్రమా। డంబరవృత్తిఁ గొందరు విడంబము
నొందుటగాని ముక్తిచే। తంబసలేదు వారలకు భ్రాంతిసంసృతి వెంటనంటి
లోకంబుల ద్రిప్పుచుండగడ గానగనియ్యక రాజశేఖరా॥ ఉ॥ మాయలు సిద్ధజా
లములు మాకదియేమిటికంచు చిత్సుఖో। పాయము గొందిముందొకటి భావ
న సేయక బాహ్యకర్మముం। దేయనువొందునైన మడికింపగు రీతినిసంచరించుని
ష్ఠాయికిపాయి గాక మతిమంతనమందికిపాయిగలుగునే॥ క॥ పోయికినోర్చినవా
రలు। భీమనిగగనాదియానసిద్ధుల నెల్లన్। రోయక రోసినవారే। మాయాసం
సారహీనమానవరాయా॥ గీ॥ కాయసిద్ధులు మొదలుగాగలవియెల్ల। మదు
రుగూరాను చెనుక జెదరకుండ। పొదగబట్టుట మాయకాపురముగాదె। యట్లు
గావునసవియెల్లమాత్మగావు॥ గీ॥ మాయయముక్తిగాదు మహిమలును క్తిగా। దా
శేషముక్తిగాదు మఖిలములును। రోసివిడుచునదియెపాదిమ్ముక్తియగా। భువన
క్షీరిజాలబాధలోల॥ శా॥ రూపవ్యాపిజగత్ప్రపంచము మదిన్ రోశించి సన్మాత్ర
చిద్రూపానందపదానుభోగమున సంతోషించు యోగీంద్రులా। రూపవ్యాప్త
జగత్ప్రపంచవిషయార్థాధిక్రియాలాపమా। శాపత్యంబులనైన సిద్ధమహిమల్
గాంక్షింతు రేమూర్ఖులై॥ క॥ పాపాత్మా యామజయంబున। మానవులు ధరిత్రియం
దుమరికొన్నిదుల్। గానంగబడుదురింతే। కానిగలదె కాయసిద్ధికలలోనైనన్॥
గీ॥ కాయసిద్ధికల్లగాతన్మనెట్లయిన। కన్నవిన్నవారుగలరె ధాత్రి। మూర్ఖులైన
వారు మొసుగుచుండురుగాక। యమరులందునైననట్లుగలదె॥ గీ॥ హాతిపాపట్రి

